# వేదము — సత్యాన్వేషణ

వేదములు భగవంతుని నిశ్శ్వాసలవంటివనియు దానికి కర్త అని ఎవఁడును ఉన్నట్లు తెలియుటలేదు గాన అవి అపౌరుషేయములనియుఁ బెద్దలందురు. వేదములు వర్ణాశ్రమ ధర్మములను గూర్చి చెప్పినవి. ఈ వేదములను శ్రుతులు (ధ్యానావస్థలో ఋషులకు వినఁబడినవి.) అనియు అందురు. వీనిని స్మరించి చెప్పఁబడినవి స్మృతులు, ఆ స్మృతులను మనువు ఆపస్తంబుఁడు మొదలగువారు చెప్పిరి. అందులో బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రు లనువర్ణములవారు నల్గురు కలరనియు వారి వారికి వేరువేరు కర్మలున్నవని ఆ ఋషులు చెప్పిరి. వేదములు చదువుట, చదివించుట, యజ్ఞములు చేయుట చేయించుట, దానము చేయుట పుచ్చుకొనుట అను ఆరు కర్మలు బ్రాహ్మణులకుఁ జెప్పఁబడినవి. వేదములు చదువుట, యజ్ఞములు చేయుట, దానమిచ్చుట, యుద్ధముచేయుట, రాజ్యపాలనము అను కర్మలు క్షత్రియులకుఁ జెప్పఁబడినవి. వైశ్యులకు మొదటి మూఁడును వర్తకము చేయుట, పశుపాలన, కృషి కర్మ అని చెప్పఁబడెను. శూద్రులకు సేవ చేయుట వృత్తి అని చెప్పఁబడినది.

యోఽనధీత్య ద్విజో వేద మన్యత్ర కురుతే శ్రమం
స సాన్వయః శూద్రసమః పాత్రతాం న ప్రపద్యతే

తల్లి గర్భమునుండి పుట్టుట, గురువు దగ్గర జ్ఞానము పొందుట (జ్ఞాన జన్మ) అను ఈ రెండుజన్మలు గలవారు ద్విజులనఁబడిరి. వారు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు అయి యున్నారు. ఆ ద్విజులు అనఁగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు వేదము చదువక ఇతరములందు శ్రమ చేసినచో వారును శూద్ర సమానులవుదురని స్మృతి చెప్పుచున్నది. ఆ వేదము కూడ అర్థము సహితముగాఁ జదువకపోయినచో వాఁడు ఎద్దు మొద్దువంటివాఁడు. అర్థజ్ఞానములేని వేదమువలన ఉపయోగము లేదని యాస్కాదులు చెప్పిరి. ఆ బ్రాహ్మణులు కూడ పై కర్మలే చేయవలయునే కాని సేవా వృత్తియు ధన సంచయమును చేయరాదనియు శరీరపోషణముకంటె ఎక్కువ యుంచుకొనరాదనియు స్మృతులు ఘోషించినవి. "సేవా వృత్తిః శ్వ వృత్తిః స్యాత్, శ్వ వృత్తిర్నకదాపిచ" "కృషి కర్మచ కారయేత్" సేవావృత్తి కుక్కవృత్తి

యనియు ఆ వృత్తి యెన్నటికిఁ జేయరాదు. జీవికకు తప్పనిసరియైనచో ఆపద్ధర్మముగా "కృషి కర్మ" మాత్రము చేయింపవలెననియు స్మృతులు ఘోషించినవి. ఇది ప్రాచీన ధర్మము.

ఇదివరలో ఇటువంటి కర్మలు చేయువారున్నను నేడు మాత్రము ఎవరో కొందరె వ్రేళ్ళమీద లెక్కపెట్టఁదగినవారుగనే యున్నారు. పూర్వము చెప్పఁబడిన ధర్మముల ప్రకారము అర్థజ్ఞాన పూర్వకముగా వేదములు చదువక, సేవకవృత్తి చెయుచు ధనసంపాదనము చేయుచుండుటచే వారు వేదధర్మము నుండి భ్రష్టులైనట్లే. కాని నేడు పై ధర్మములు ఆచరించకపోయినను జన్మ చేతనె బ్రాహ్మణులమనుకొనువారిని బట్టి వారివలెనే మేమును ఎందుకు వేదములు చదువరాదు? మాకంటె వారి ఘనత ఏమి? అని నేటివారు చెప్పుచున్నారు. మరియు శూద్రాదులు వేదార్హులు ఎందుకు కారు అని ఈ క్రింది సూక్తులను ప్రమాణముగా చెప్పుచున్నారు.

యథేమాం వాచం కళ్యాణీ మావదాని జనేభ్యః
బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయచార్యాయ స్వాయ చారణాయ
(యజు. అధ్యా. 26–2)

ఈ కళ్యాణమైన వేదవాక్కును బ్రాహ్మణునకు, రాజునకు, శూద్రునికి, వైశ్యునికి స్వసంబంధియగు వానికి చెప్పితినో అట్లే నీకు చెప్పుచున్నాను" అను సూక్తి యజుర్వేదములోఁ గనిపించుచున్నది. వారివారి ప్రవర్తనను బట్టియు శూద్రాదులు బ్రాహ్మణాదులుగాను, బ్రాహ్మణాదులు శూద్రాదులుగా వవుదురు.

శూద్రో బ్రాహ్మణతా మేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్
క్షత్రియాజ్జాత మేవంతు విద్యాద్వైశ్యాత్తథైవచ
(మను. 10– 5)

అని యీ సూక్తి చెప్పుచున్నది.

ధర్మచర్యయా జఘన్యోవర్ణః పూర్వం పూర్వం వర్ణమాపద్యతే జాతివరివృత్తౌ అధర్మ చర్యయా పూర్వోవర్ణో జఘన్యం జఘన్యం వర్ణమాపద్యతే జాతి వరివృత్తౌ (అపస్తంబ)

ధర్మాచరణచే క్రింది క్రింది వర్ణము తనపై పైవర్ణమును పొందును. అధర్మాచరణచేత పైపై వర్ణము తన క్రింది వర్ణమును పొందును అని యాప స్తంబుడు చెప్పెను.

స్వాధ్యాయేన జపైర్హోమై స్త్రైవిద్యేనేజ్యయా సుతైః
మహా యజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః

(మను. 2–28)

బాగుగానున్న మంచి చదువుచేత, జపములచేత, హోమములచేత వేద త్రయ పాఠముచేత ఇష్టిచేత, సుతులచేత, మహాయజ్ఞములచేత యజ్ఞములచే ఈ శరీరము బ్రహ్మకు సంబంధించినదిగా అనఁగా బ్రాహ్మణవర్ణమునదిగా చేయ బడుచున్నది అని

న విశేషో స్తి వర్ణానాం సర్వం బ్రాహ్మ్యమిదం జగత్
బ్రహ్మణా పూర్వ సృష్టం హి కర్మభి ర్వర్ణతాంగతం (భారతము)
చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః (గీత)

వర్ణములలో విశేషము లేదు. బ్రహ్మచే సృజింపబడినవి. కర్మలచే అయా వర్ణములైనవి. నాచేత గుణకర్మల విభాగమునుబట్టి నాలుగు వర్ణములు సృజింపఁబడినవి అను సూక్తులను నేటివారు సత్త్వాది గుణములనుబట్టి బ్రాహ్మ ణాదులుగాఁ జేయఁబడిరని చెప్పుదురు. పూర్వులు వారువారుచేసిన సాత్త్వి కాది గుణకర్మలనుబట్టి బ్రాహ్మణాదులుగా సృజించితినని యర్థము చెప్పుదురు. మరియు దీనికి ప్రమాణముగా నిట్లు చెప్పుదురు.

"రమణీయచరణా రమణీయాం యోనిం ప్రపద్యంతే కపూయ చరణాః కపూయాం యోనిం ప్రపద్యంతే శ్వయోనిం వా చండాల యోనింవా"

"మంచి ప్రవర్తనగలవారు మంచిజన్మను పొందుదురు. చెడు ప్రవర్తన గలవారు కుక్కగానో చండాలుడుగానో పుట్టుదురు" అని.

మరియు శస్త్రగురువులు ద్రోణ, కృపాచార్యాదులు యుద్ధముచేసినను బ్రాహ్మణులుగానే పరిగణింపబడిరి. బ్రహ్మ జ్ఞానమున్న జనకాదులు క్షత్రి యులుగాను విదురాదులు శూద్రులుగాను పరిగణింపఁబడిరి.

విశ్వామిత్రుడు క్షత్రియుఁడైనను శమాది గుణములు పొంది బ్రహ్మర్షి యయ్యెను.

మఱియు వ్యాసమహర్షిచే రచింపఁబడెనని చెప్పఁబడు సిద్ధాంత దర్పణములో నిట్లు చెప్పఁబడెను.

గుణేభ్యో భేదో జాతిక్రియయో కాలానాం (సిద్ధాం. 1-4-12)

గుణములఁబట్టి జాతికి క్రియకు కాలమునకు భేదము కలుగును. శుద్ధ సత్త్వగుణంబుచేత బ్రాహ్మణ జాతియు, సత్త్వము నాశ్రయించిన రజోగుణంబుచేత క్షత్రియజాతియు తమోగుణము నాశ్రయించిన రజోగుణముచేత వైశ్యజాతియు రజోగుణమునాశ్రయించిన తమోగుణముచేత శూద్రజాతియుఁ గలుగును. క్రియలంటే శమ శౌర్య కృషి సేవాదులు. కాలము అంటే సత్య యుగ త్రేతాయుగాదులు.

నోన్మేషశ్చే త్సత్త్వవృత్తేరన్య జాతీయాః (సిద్ధాంత. 1-4- 4. కృత)

సత్త్వాది గుణములు భాసిల్లక శౌర్యాదులు భాసిల్లినచో బ్రాహ్మణ కులమునందుఁబుట్టినను క్షత్రియుఁడేయగును. శౌర్యాదులు భాసిల్లినచో క్షత్రియకులమందు పుట్టినను బ్రాహ్మణుడేయగును. ఇట్లే వైశ్య శూద్రుల విషయమునను గ్రహింపవలెను.

పై వానిని బట్టి చూచినచో ఎవరు ఎట్టివారో తెలిసికొనుటలో చిక్కులు గలుగుటయే యగును. ఒకే కులమునందుఁబుట్టిన వారుగూడ వారి వారి స్వభావములను బట్టి భిన్న జాతీయులు కావలసివచ్చును. లోక వ్యవహారములోఁ గూడ సాంకర్య మేర్పడును.

కాని సాధారణముగా మానవులు తమ తమ తల్లి దండ్రుల గుణకర్మలు గలవారై యుందురు మరియు తమ తల్లిదండ్రుల వృత్తుల ప్రకారము అలవాటుల ప్రకారము నడుచు చుందురు. ఆహార వ్యవహారములు గూడ తల్లి దండ్రులను బట్టి యింటి పరిస్థితులను బట్టి వాని కనుగుణముగానుండును. ఎవరైన నొక్కడు శౌచ వంతుఁడై సాత్త్విక ప్రవృత్తిగల వాఁడైనను కుటుంబము లోని వారందఱు అట్లుండుట లేదు.

తల్లి దండ్రులు వారి బంధువులు శౌచము సాత్త్వికాది గుణములు గలవారైనచో వారి సంతానము కూడ అట్లేయుండును. తల్లిదండ్రులు వారి బంధువులు సాత్త్విక శౌచాది గుణములు లేని వారైనచో వారి సంతానము గూడ అట్లే యుండుట మనము చూచుచున్నాము. కనుక పూర్వులు జన్మను బట్టి కులములు వ్యవహరించుటలోని యాథార్థ్యము కావచ్చును.

ఒక వేళ తల్లి తండ్రులు శౌచాదులు లేని వారైనను ఒకానొకడు సత్త్వాది గుణవంతుడుగా నుండవచ్చును. అట్టివానిని బ్రాహ్మణుని క్రింద గ్రహించి వానికి వేదాదులు బోధింపవచ్చును ఇందుకు విశ్వామిత్రుడు సత్య కామజాబాలుండు మొదలగు వారిచరిత్ర లిందుకు నిదర్శనములు

చలితశ్చైనాన్ స్వధర్మేస్థాపయేత్ (గౌ 11)

స్వధర్మము నుండి పడిన వారిని రాజు వారి వారి ధర్మములలో నుంచుచు నట్లుండనివారిని క్రింది వర్గములలోనికి పంప వలెను

పై పై వర్ణములనబడు వారిలో అధర్మ ప్రవర్తనలును క్రింది వర్ణ ములనబడు వారిలో ధర్మ ప్రవర్తనలును కనబడు చున్నవి.

వైదిక ధర్మము నుండి జారిన బ్రాహ్మణులు చాలమంది వేదములు చదువక సేవక వృత్తిని చేయుచున్నను కొంత వరకు శౌచము సాత్త్విక ప్రవృత్తియు గలిగి యుండుట ఇతరులు చాలమంది అట్లు ఉండకపోవుట నేడు వారి ఆచారవ్యవహారములలోఁగనుపట్టుచున్నది.

పూర్వులు చెప్పిన ప్రకారము ఎనిమిదవ యేటనే సరియైన యాశ్రమ ములకుఁబంపి, బ్రహ్మతత్త్వమును, బ్రహ్మచర్యమునకును గృహస్థాద్యాశ్రమ ములకును ముఖ్యాశయమైన వేద విజ్ఞానమును తెలిపి నిజమైన జ్ఞాను లనుగావించినచో మన భారత సంస్కృతి తిరిగి తల యెత్తుకొని ప్రపంచము నందు గురుస్థానమును పొందఁగలుగును.

ధనములు ఉద్యోగములు ఆశించి బ్రాహ్మణులు పతితులైరి. జీవితములకు జ్ఞానమె లక్ష్యముకాని ధనము ఉద్యోగములు కావని గ్రహించి వానికై ఎగబడ కుందురుగాక. ఇందు వేదములను గూర్చిన వివరణమును, ఆవేదములు చదువు పద్ధతులును వానినర్థము చేసికొనుటకు వైదికవ్యాకరణము నిఘంటు వును చేర్పబడెను. వీనినిగ్రహించి వేదవిజ్ఞానులగుదురుగాక.

ఇట్లు; విధేయుడు

చర్ల గణపతి శాస్త్రి

# విషయ సూచిక



---

# వేద విజ్ఞానము

"విదంతి అనేన ధర్మం" దీనిచే జనులు ధర్మమును తెలిసికొందురు కనుక వేదము అని వేదశబ్దమునకు వ్యుత్పత్తి అర్థము. ఇది విదజ్ఞానే అను ధాతువు నుండి ఏర్పడిన రూపము, విద విచారణే (విచారణయందు) "విద సత్తాయాం (ఉనికియందు) విదజ్ఞానే (జ్ఞానమందు) విద్‌ౢ లాభే (లాభమందు) ఏతేషాం ధాతూనాం విషయే వర్తతే యస్మాత్ తతోవేద ఇత్యుక్తః" విద అను క్రియ విచారణ, ఉనికి, జ్ఞానము, లాభము అను అర్థములందు ఉన్నది కాన వేదము అని చెప్పబడినదని శంకర భాష్యము. "ఇష్టప్రాప్త్యనిష్టపరిహారయో రలౌకిక ముపాయంయో వేదయతి సవేదః" ఇష్టము లభించుటకును అనిష్టము పోగొట్టు కొనుటకును అలౌకికమైన యుపాయమును తెలుపునది వేదము.

ప్రత్యక్షేణానుమిత్యా వా యస్తూపాయో న బుధ్యతే
ఏవం విదంతి వేదేన తస్మాద్వేదస్య వేదతా.

ప్రత్యక్షముగాంగాని, అనుమాన ప్రమాణముచేతంగాని దేనికి ఉపా యము తెలియబడదో అది వేదముచేత తెలియబడును. కాన దీనికి వేద మను పేరు వచ్చినది. స్వర్గాదులుగాని పుత్రకామేష్టినిబట్టి పుత్రజననము దర్శ పూర్ణ మాసాది కర్మల ఫలములు పాపపుణ్యములు యజ్ఞాదులవల్ల వచ్చు వర్షాది యోగములు, సోమయాగ వాజసనేయ రాజసూయాదుల వచ్చు పుణ్య ఫలము లును స్వర్గాదులును వేదమువల్ల దెలియనగును. అవి ప్రత్యక్షానుమాన ప్రమాణాదులవల్ల తెలియవు. ప్రత్యక్షాది ప్రమాణాన వగతార్థ బోధకత్వం వేద త్వం" అని సూక్తి. ఇట్లు చేసినచో స్వర్గము వచ్చును. ఈ కర్మలు చేయక పోయినచో పాపము కలుగును. వృష్టి, పుత్ర స్వర్గాది ఫలములను ప్రత్య క్షానుమానాదులు బోధింపలేవు. "మంత్ర బ్రాహ్మణయోర్వేద నామధేయం" మంత్రభాగములు బ్రాహ్మణ భాగములు వేదములని చెప్పబడునని అపస్తంబ మహర్షి బ్రాహ్మణభాగములు వేదములు కావని దయానందస్వామి.

## వేదములెన్ని

అనంతావై అను సూక్తినిబట్టి వేదములు అనంతములు అని తెలియు చున్నది. "భరద్వాజోహత్రిభిరాయుర్భిర్బ్రహ్మచర్యమువాసతం జీర్ణిం స్థవి

రం శయానం ఇంద్ర ఉపవ్రజ్యోవాచ. భరద్వాజ యది చతుర్థమాయుర్ద ద్యాం కిమనేన కుర్యాః. బ్రహ్మచర్య మేవేతేన చరేయమితి హోవాచ. తం హ త్రీన్ గిరిరూపా నజ్ఞాతానివ దర్శయాంచకార, తేషాం హైకైకస్యా న్ముష్టిమాదదే సహోవాచ భరద్వా జేత్యామంత్ర్య వేదావై ఏతే. అనంతా వై వేదాః" ఇతి.

"నీకు నాలుగింతలు ఆయుర్దాయము ఇచ్చినను వేదములను తెలిసికొన లేవు. అవి అనంతములు. అవి గో వేదములు పర్వతములంతటివి, నీవీ మూడు జీవితములలో తెలిసికొన్నది ఈ మూడు గుప్పిడులే అని భరద్వాజునితో ఇంద్రుడనెను. తై. బ్రా. 3-10, 11, 34)

## వేదములు మూడు

జ్ఞానప్రదములైన వేదములు అనంతములైనను నేడు బాహ్యరూపముగ చూచినచో అవి మూఁడు. లోకవ్యవహారములో అవి ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము అని నాలుగు విధములు చెప్పబడినను విషయవిభాగమునుబట్టి చూచినచో అవి మూఁడె అని గ్రహింపవలెను. "త్రయీ వై విద్యా ఋచోయజూంషి సామాని" అని శతపథము (శత. 4-6-7-1) లో చెప్పబడెను. వేదవిద్య ఋక్కులు యజుస్సులు సామములు అని మూఁడు విధములు. వానిని త్రయి అందురు. అని. "ఇతి వేదాస్త్రయ స్త్రయీ" ఇట్లు వేదములు మూఁడు అని యీ విధముగా నిఘంటువులందును చెప్పఁబడెను. కనుక విషయ విభాగమును బట్టి మూఁడు అన్నను బాహ్యరూపమును బట్టి నాలుగు అన్నను విరోధము లేదు.

## వేదములు అపౌరుషేయములు

అవి అపౌరుషేయములు అవి ఏ పురుషునిచేతను రచింపఁబడినవి కావు. నిత్యములు. "అనాది నిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా" ఆదౌ వేదమయీ దివ్యా తతః సర్వాః ప్రవృత్తయః" (మహాభారతము 12-224-55) ఆది అంతములు లేని నిత్యమైన వాక్కు స్వయంభువుచే పైకి వెల్లడిచేయబడినది. అది ఆదిలో దివ్యమైన వేదమయ వాక్కు. దానినుండి సర్వ ప్రవృ

త్తులు బయలుదేరినవి, అని. "తస్మాద్యజ్ఞాత్సర్వ హుతః। ఋచః సామాని జజ్ఞిరే। ఛందాంసి జజ్ఞిరే తస్మా। ద్యజు_స్తస్మా దజాయత" (యజు 31-7) ఆ యజ్ఞమునుండి సర్వ దేవతలను పిలుచు ఋక్కులు, సామములు బయలుదేరినవి. దానినుండి ఛందస్సులు, యజుస్సులు బయలుదేరినవి.

సర్వపుంసా మధ్యయన మధ్యయనాంతర పూర్వకం। సర్వే చయథైవ గురుణా అధీరం తథైవ అధి జిగాంసిరే। నపునః స్వాతంత్ర్యేణ కశ్చిదపి ప్రథమోఽధ్యేతా వేదానామస్తి యః కర్తాస్యా_త్తస్మా దపౌరుషేయాః

(పూ. మీమాంసా వ్యాఖ్య)

పురుషులందరకు అధ్యయనము ఇతరాధ్యయనమె పూర్వముగాఁ గలది. అన్నియు ఎట్లు గురువుచే చదువఁబడెనో అట్లే తెలిసికొనిరి. స్వతంత్రముగా కాదు. ఎవడు వేదములకు కర్తగానుండునో అట్టివాడు వేదాధ్యయనమందు లేడు. కనుక అవి అపౌరుషేయములు" (అని మీమాంస వ్యాఖ్య)

"యో బ్రహ్మాణం విదధాతిపూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై"

ఎవఁడు పూర్వము బ్రహ్మమును కూర్చెనో యెవడు వేదములను పంపెనో అతనికి నమస్కారము అని.

ఏవం వా అరేఽస్య మహతో భూతస్య
నిశ్శ్వసితమేతత్, యదృగ్వేదో యజుర్వేదః
సామవేదోఽథర్వాంగిరసః" (శత. కా. 14-6-5 బ్రా. 4-4 కం 10)

ఓసీ! మైత్రేయీ! ఈ ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వాంగిరసము. ఈ మహాభూతము (పరమాత్మ) యొక్క నిశ్వాసములు.

"తేభ్య స్తప్తేభ్య స్త్రియో వేదా అజాయంత
అగ్నేఃఋగ్వేదో వాయోర్యజుర్వేదః
సూర్యాత్సామ వేదః" (శతప. కాం. 11-6-5)

ధ్యానించబడిన ఆ వానినుండి వేదములు బయలుదేరినవి. అగ్నినుండి ఋగ్వేదము, వాయుపునుండి యజుర్వేదము, సూర్యునినుండి సామవేదము

కలిగెను, అను సూక్తులనుబట్టి అవి అపౌరుషేయములని తెలియుచున్నది. ఇట అగ్ని వాయు సూర్యపదములు అధిదేవతా పరములు. అనఁగ అగ్నికధిదేవత, వాయువున కధిదేవత, సూర్యునికధిదేవత యగు దేవతలనుండి వ్యక్తమైనవి అనిగాని అగ్నివాయుసూర్యోపాసకులగు మహర్షులచే దర్శింపఁబడినవి అనిగాని చెప్పుకొనవచ్చును. కఠాదిపురుష చరణైః పరం పఠయా ఽధీయమానా కఠశాఖా, ఇతి అభిధీయతే, కఠశాఖీయులచే చదువబడినది. కాన కఠశాఖ అని చెప్పబడినది. కాన అది అపౌరుషేయమె.

వేదములలోని కఠగార్గి అత్రేయి మొదలగు మానవనామములు కథరూపముగా చెప్పబడిన వానిలోని కల్పిత నామములెగాని అసలు ఆ పురుషులున్న తరువాత చెప్పబడినవి కావు. వేదవాణి కల్పిత నామముల ద్వారా ఆఖ్యాయికలు చెప్పి మనుష్యులను సత్ప్రవర్తన గలవారిగా చేయుటకే.

"స్తుత్యర్థ మిహదేవానాం వేదః సృష్టః స్వయంభువా"
దేవతలను స్తుతించునవి మంత్రములు (భారతము 325)

దేవతలను స్తుతించుటకొఱకు వేదము స్వయంభువునిచే వేదము సృష్టింపబడెను అని భావము.

## ఋగ్వేదాది విషయ వివరణము

ఋచస్తుతౌ అను ధాతువునుండి ఋక్ అను పదము ఏర్పడినది. అగ్ని ఇంద్రుడు మొదలైన అధిదేవతలను స్తుతించునవి గాన ఋక్కులనఁబడెను. అటువంటి ఋక్కులు గలది ఋగ్వేదము. యజపూజాయాం అను ధాతువునుండి యజుస్సు అను పదము ఏర్పడినది. దేవతలను దర్శపూర్ణ మాసాది యజ్ఞాదులద్వారా పూజించునవి యజుస్సులు. అవి గలది యజుర్వేదము. యజ్ఞాదులందు దేవతాపూజకై ఈ యజుస్సులు ఉపయోగింపబడును. సముముగా ఉదాత్తానుదాత్తస్వరితాది స్వరములచే సరిగాఁ జక్కగా గానము చేయబడునవి సామములు. అవి గలది సామవేదము. అథర్వవేదము అనబడు వేదములో పైని చెప్పబడిన ఋక్కులు యజుస్సులు, సామములు గలిసియున్నవి. అథర్వుడను ఋషి దర్శించిన మంత్రములుగూడఁ జాల యున్నవి గాన అథర్వవేదమనబడినది. అది వేరే వేదము కాదు. కాని అథర్వఋషి ద్రష్టమగుటచేత అథర్వవేదమని వేరుగా ప్రత్యేకమై వ్యవహరింపబడినది.

## మంత్రములు

ఈ ఋక్కులను, యజస్సులను, సామములను మంత్రములందురు. "మననాత్ త్రాయతే యస్మాత్" మననము చేయుటవలన రక్షించునవి గాన మంత్రములని వ్యుత్పత్తి. వీనిని ఛందస్సులని కూడ అందురు. "ఛందాంసి ఛాదనాత్" ఉత్తమ భావములను కప్పునవి కనుక ఛందస్సులైనవి." అని యాస్కముని యనెను.

"మంత్రేభ్యోహి అధ్యాత్మాధీ దైవతాధి యజ్ఞమంతారో మన్యంతే తన్మంత్రత్వం" మననము చేయు మంత్రములవల్ల అధ్యాత్మ అధిదైవత అధియజ్ఞ భావములు మననము చేయబడుచున్నవి. యత్కామ ఋషిర్యస్యాం దేవతా యామార్థ పత్యమిచ్ఛన్ స్తుతిం ప్రయుంక్తే తద్దైవతః సమంత్రో భవతి. (యాస్కుడు) ఏ కోరికగల ఋషి ఏ దేవతనుగూర్చి ప్రయోజనమును గోరి స్తుతించునో ఆ మంత్రము ఆ దేవతకు సంబంధించినదగుచున్నది.

"సాక్షాత్కృత ధర్మాణో ఋషయోబభూవుః। తేఽవరేభ్య అసాక్షాత్కృత ధర్మేభ్య ఉపదేశేన మంత్రాన్ సంప్రదదుః"

ఋషులు ధర్మములను సాక్షాత్కారము చేసికొనిరి. వారు ధర్మములను సాక్షాత్కరింపఁజేసికొనని తక్కువవారికి ఉపదేశముల ద్వారా మంత్రములను ప్రసాదించిరి. (యాస్కముని)

వేదములు స్వతః ప్రమాణములు. అవి పరమేశ్వర నిశ్శ్వసితములు. కాన వానికవే ప్రమాణములు. వానికింకొక దానివల్లఁ బ్రామాణ్యము సిద్ధింప నక్కరలేదు. వీనినిబట్టి స్మృతి శాస్త్రములకు ఇతిహాసాదులకును ప్రామాణ్యము సిద్ధించును అని పూర్వులు చెప్పిరి.

## వేదములర్థసహితముగా చదువవలెను.

"స్వాధ్యాయోఽధ్యేతవ్యః"

స్వాధ్యాయము అనఁగా వేదము చదువదగినది. అను సూక్తియు వేదప్రాశస్త్యమును దెలుపుచున్నది. "నిష్కారణో షడంగో వేదః అధ్యేతవ్యో జ్ఞేయశ్చ" కారణములు లేని (అనఁగా కారణములేవో సరిగా తెలిసికొనలేని) వేదములు, ఆఱు (శిక్ష కల్పము, వ్యాకరణము, నిరుక్తము, జ్యోతిషము, ఛందస్సు) అంగములతోఁ గూడినది దానిని చదువవలెను.

అర్థపూర్వకముగ తెలిసికొనవలెను.

వేదమును చదువనివాడు శూద్రుడె

యోఽనధీత్య ద్విజోవేద మన్యత్రి కురుతే శ్రమం

స సాన్వయశ్శూద్ర సమః పాత్రతాం నప్రపద్యతే।

ఏ ద్విజుడు వేదమును చదువక ఇతర విషయములందు పరిశ్రమ చేయునో వాడు శూద్రసముడై పాత్రతను పొందడు" అను సూక్తి వేదప్రాశస్త్యమును చెప్పుచున్నది.

"జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః"

పుట్టుకలో మనుష్యుడు శూద్రుండై పుట్టును. వేదకర్మ జ్ఞానాదులద్వారా రెండవ జన్మను అనఁగ ద్విజత్వమును పొందును. పుట్టిన పిదప గురుకులమందు గురుముఖమున వేదాదులు చదివి ద్విజుఁడు కావలయును. గురుముఖా దనుశూయతే ఇతి అనుశ్రవో వేదః" గురు ముఖముగా శుద్ధముగా సుస్వర యుక్తముగా చదువఁబడును. కనుక వేదము "అనుశ్రవము" అని చెప్పబడెనని వాచస్పతి మిశ్రుడనెను. పూర్వము వేదములు స్వరయుక్తముగ గురుముఖమునుండి నేర్వబడినవి. సంహిత అగ్నిమీడే పురోహితం అన్నది అగ్నింఈడే పురోహితం అన్నది పదము అగ్నిం ఈడే, ఈడే పురోహితం పురోహితం అన్నది క్రమము. ఇది క్రమ జట ఘన అను భిన్నభిన్న ప్రక్రియలతో నేర్చుకొనఁబడు చుండెను. ఉదాహరణములు వీనికి వివరముగా ముందు చూపబడును. గురుముఖమున స్వరయుక్తముగ నేర్చుకొనబడుచు పిదప అర్థము తెలిసికొనఁబడు చుండెను. పాఠకాదుల యలసత్వమును బట్టి క్రమముగా వేదములు అర్థరహితముగాఁ జదువఁబడుచుఁ జివరకు అర్థవిచారణ చేయకపోయినను పాఠమాత్రముచేతనే ఫలితము సిద్ధించునను నమ్మ స్థితి కలిగినది. అర్థవిచారణకే జైమినిమహర్షి పూర్వమీమాంసను రచించెను. ఉవట సాయణాదులు వేదభాష్యములను రచించిరి. యాస్కముని నిరుక్తమును ప్రవచించెను. అర్థరహితముగాఁ జదువువారిని గూర్చి

"పాఠమాత్ర రతాన్ విప్రాన్ వాఙ్మాత్రేణాపి నార్చయేత్" అర్థము తెలిసికొనకుండ పాఠమాత్రము చేయువారిని మాటలచేతఁగూడ అర్చింపరాదనుపై సూక్తిబయలు దేఱవలసి వచ్చినది. కనుకనే పూర్వ మీమాంసలో వేదము

లోఅర్థము బోధించునది" అను అధికరణము చెప్పవలసి వచ్చినది. కాలక్రమములో వేదములు అసలేపోవు స్థితి రాకుండ స్వరము పోకుండఁజక్కఁగా గురు ముఖమున నేర్చుకొని యింతకాలముదాక వేదములను రక్షించిన వారిని అభినందింపక తప్పదు. అసలు వేదములే పోవునేమో అను భయముచే పారాయణ వలన ఫలము సిద్ధించునని పూర్వులు చెప్పుటలోని రహస్యము. పారాయణ చేయు వారు ఎప్పటికైనను అర్థము తెలిసికొనరా అనియు అర్థము తెలిసికొని వానిలోఁజెప్పబడిన వానిని చేయుకుందురా అని తలచి చెప్పిన భావమును తెలియక పాఠ మాత్రముతోనే సంతృప్తి పొందు స్థితికి సంఘము దిగజాఱిపోయినది కనుకనే

"యథా ఖరశ్చందన భారవాహీ, భారస్యవేత్తా వహి చందనస్య
ఏవంహి శాస్త్రాణి బహూన్యధీత్య, చార్థేషుమూఢాః ఖరవ ద్వహంతి"

మంచి గంధపు చెక్కల బరువును మోయుగాడిద మంచి గందపుచెక్కల స్థితిని తెలియునట్లు చాల శాస్త్రములు చదివి అర్థము తెలియక మూఢులగుచున్నారు అను సూక్తిని చెప్పవలసి వచ్చినది. నిరుక్తములో యాస్కముని ఈ క్రింది విధముగా ననెను.

"స్థాణుర యం భారహారః కిలా భూదధీత్య వేదం, న విజానాతియోఽర్థం, యోఽర్థజ్ఞః ఇత్ (ఏవ) సకలం భద్ర మశ్నుతే"

వేదమును జదివి ఎవఁడు అర్థమును తెలిసికొనఁడో, వాఁడు కేవలము బరువు మోసెడి యెద్దువంటి మొద్దు. అర్థమును తెలిసికొన్న వాఁడె సకల శుభమును పొందును."

"నాకమేతి జ్ఞానవిధూత పాప్మా"

అతడు జ్ఞానముచే పాపమును కడిగివేసికొని స్వర్గమును పొందును. "యద్గృహీత మవిజ్ఞాతం నిగదేనైవ శబ్ద్యతే" గురు ముఖమునుండి గ్రహించి తెలియఁబడనిదై శబ్దమంత్రముచేత ఉచ్చరింపఁబడుచున్నదో అది "అనగ్నావివశుష్కైధో న తత్ జ్వలతి కర్హిచిత్" (నిరుక్తము. 16–6–9) కట్టె ఎండినదైనను నిప్పులేనిచోట వేయఁబడి ఏ మాత్రము మండదు.

"యో హవా అవిదితార్షేయచ్ఛం దోదైవతం బ్రాహ్మణ మంత్రేణ యాజ

యతి వా అధ్యాపయతి వా స్థాణుం వార్ఛతి గర్తం వా పద్యతే పాపీయాన్ భవతి" (తాండవ తలవకార శాఖలు) ఏవఁడైతే ఋషిదృష్టములైన మంత్రములు గం ఛందస్సు బ్రాహ్మణములు గల మంత్రములను అర్థయుక్తముగా తెలియఁడో యజ్ఞము చేయించునో వాఁడు మొద్దు. గర్తమును పొందును, పాపియగును."

ఏవం విదమేవాధ్వర్యుం కుర్వీత, నానేవం విదం; ఏవం విదమేవ హోతారం కుర్వీత, నానేవం విదం; ఏవం విదమే వోద్గాతార కుర్వీత నానేవం విదం; ఏవం విదమేవ బ్రాహ్మణం కుర్వీత నానేవం విదం" ఇట్లు వేదార్థము తెలిసిన అధ్వర్యునినె, హోతనె, ఉద్గాతనె బ్రాహ్మణునినె పెట్టుకొనవలయును. అర్థము తెలియనివానిని ఎపుడును పెట్టుకొనరాదు. (అని వాజసనేయ శాఖ)

"ఉభేకురుతో యశ్చైతత దేవం యాశ్చన వేదయ దేవవిద్యయా కరోతి.... తదేవ వీర్యవత్తరం భవతి" తెలిసినవాఁడును తెలియనివాఁడు ఈ యిద్దఱు కర్మలు చేయుదురు, కని ఏది తెలిసిచేయునో అదే వీర్యవత్తరమగును. కొందఱు మంత్రములు స్పష్టార్థములుగా లేవందురు. అది వేదాపరాధము కాదు. సరిగ తెలిసికొననివానిదే. దారిలోనున్న ఱాతిని చూడక దానిమీఁద పడినచో అది అజ్ఞాని యపరాధమె కాని ఱాతియపరాధము కాదు" (యాస్క. 1-17-10 నిరుక్తము.)

"నాఽవై యాకరణాయ నాఽనుపసన్నాయ నా విదం విదే వా

వ్యాకరణ లక్షణములు తెలియనివానికిని, శ్రద్ధతో తెలిసికొనగోరి శిష్యుడై రానివానికి, ఈ నిరుక్తశాస్త్రము తెలియనివానికిని చెప్పరాదు.

విద్యాహవై బ్రాహ్మణమాజగామ. గోపాయమాం, శేవధిరస్మి

వాగ్దేవత బ్రహ్మవేత్తను సమీపించి, నన్ను రక్షింపుము నేను నిధిని అనెను.

అసూయకాయానృజవేఽయతాయ న బ్రూయాః వీర్యవతీ తథాస్యామ్. నీవు అసూయకలవానికిని ఋజుత్వము లేనివానికిని నియమము పాలించనివానికిని చెప్పకుము. అట్లయినపుడే నేను వీర్యవంతురాల నవుదును అని, సత్యముచెప్పిన సత్యకాముని గురువు నీవు బ్రాహ్మణుడవనెను.

ఋక్, పాదబద్ధా, గీతంతుసామ, గద్యం యజుర్మంత్రః, ఋగ్వేదము పద్యరూపముగావ పాదములుండును. సామగాన రూపమైనది యజుస్సు గద్య రూపము.

"ఏక వింశ త్యధ్వయు క్తమృగ్వేద మృషయో విదుః
సహస్రాధ్యా సామవేదో యజురేక శతాధ్యకం
నవాధ్యాథర్వణో౽న్యేతు ప్రాహుః
పంచదశాధ్యకం."

ఋగ్వేదము ఇరవై యొక్క శాఖలుగలది సామవేదము వేయిశాఖలు గలది యజుర్వేదము నూటఒక్క శాఖలుగలది అథర్వవేదము తొమ్మిదిశాఖలు గలది కొందఱు పదునైదు శాఖలుగలది అందురు. వేదవిషయ విభాగము—

వేదములు సంహితలు బ్రాహ్మణములు అరణ్యకములు ఉపనిషత్తులు అని విషయ విభాగమును బట్టి విభజింపఁబడినవి. సంహితలు అగ్నివరుణేంద్రాది స్తోత్రాది పదములు, బ్రాహ్మణములు దర్శపూర్ణమాసాది యాగాది కర్మ బోధకములు అరణ్యకములు ఉపాసనాది పదములు, ఉపనిషత్తులు అధ్యాత్మ జ్ఞానబోధకములు.

సంహితలు పద, క్రమ, జటా మాలాది రూపముగ గురుముఖమునుండి చెప్పుకొనఁబడెను.

జటామాలా శిఖారేఖా, ధ్వజోదండోరథో ఘనః
అష్టౌ వికృతయః ప్రోక్తాః క్రమపూర్వా మనీషిభిః

క్రమము, జట, మాల, శిఖ. రేఖ ధ్వజము, దండము రథము, ఘనము అని ఎనిమిది సంహితా పాఠములోని పద్ధతులు. వానిని వికృతులందురు. వానిలో జట, దండము అనునవి ముఖ్యములు. ఈ రెండిటిని బట్టి ఇతర వికృతులు వచ్చును. అట్లే వానిని రేఖ, ధ్వజము ననుసరించు ఘనపాఠము జటా దండ ములను అనుసరించును.

పదక్రమ విశేషజ్ఞాః వర్ణక్రమ విచక్షణాః
స్వరమాత్రా విశేషజ్ఞాః గచ్ఛేయురార్య సంపదం

సంహితాపాఠతః పుణ్యం ద్విగుణం పద పాఠతః
త్రిగుణం క్రమపాఠేన జటా పాఠేన షడ్గుణం (వరాహ పురాణము)

పదక్రమ, వర్ణక్రమ విచక్షణులు స్వరమాత్రాభిజ్ఞులు ఆర్యసంపదను పొందుదురు, సంహితా పాఠమువల్ల పుణ్యమును, పదపాఠమువల్ల రెట్టింపు పుణ్యమును క్రమపాఠమువల్ల మూడురెట్లు పుణ్యము జటాపాఠముచేత ఆరురెట్లు పుణ్యము వచ్చును. (వీని వివరముచివర చూపబడును.)

విహితా స్యాననుష్ఠానా న్నిందితస్య చ సేవనాత్
అనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతనమృచ్ఛతి (యాజ్ఞవల్క్య)

వేదవిహిత కర్మలననుష్ఠింపక పోవుటవలనను నింద్యకర్మలు చేయుట వలనను ఇంద్రియములను నిగ్రహింపకపోవుటవలనను నరుడు పతితుడగును.

ఋగ్యజుస్సామాథర్వణ విభాగమును సంహితలు బ్రాహ్మణములు ఆరణ్యకములు ఉపనిషత్తులు అను విభాగమును చేసినవాఁడు కనుక బాదరాయణునికి వేదవ్యాసుడను పేరు వచ్చెను.

## విద్యలు – ఋగ్వేదము – ఋక్కులు

మన ప్రాచీనవిద్యలు పదునాలుగు 1 ఋగ్వేదము, 2 యజుర్వేదము, 3 సామవేదము, 4 అథర్వవేదము. ఈ వేదములు నాలుగు. వేదాంగములారు (శిక్ష, కల్పము, జ్యోతిషము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు) పది, 11 పురాణములు, 12 న్యాయము, 13 మీమాంస, 14 ధర్మశాస్త్రము అని. మిగిలినవి పై పదునాలుగింటిలో అంతర్భవించును.

1 శిక్ష– అక్షరోచ్చారణ విషయమును, ఉదాత్తానుదాత్తస్వరితములనెడి స్వరములను తెలుపును. ఇది పాణినిమునిచేఁ జెప్పబడినది.

2 వ్యాకరణము– శబ్దముల సాధుత్వా సాధుత్వములను తెలుపును. పాణిని వరరుచి పతంజలి మహర్షులు వ్యాకరణ కర్తలు.

3 నిరుక్తము– వైదికపదములకు వ్యుత్పత్త్యర్థము. వేదపదనిఘంటువు. మంత్రముల విషయము. దేవతల కృత్యాదులు తెలుపును. దీనిని యాస్కముని రచించెను. దుర్గాచార్యాదులు వ్యాఖ్యాతలు.

4 ఛందస్సు- పద్యలక్షణములుగలది గాయత్ర్యాదుల ఛందో విషయములను తెలుపును. దీనికర్త పింగళుడు.

5 జ్యోతిషము- వైదికయజ్ఞాదుల కాలనిరూపణము చేయునది. దీనికి గర్గాదులు కర్తలు.

6 కల్పము- వైదికకర్మలు ఎట్లు చేయవలెనో తెలుపునది. హోతచేయు పనులను ఆశ్వలాయనాది శ్రౌతసూత్రములు, అధ్వర్యువుచేయవలసినవి బోధాయనాపస్తంబాదుల శ్రౌత సూత్రములు. ఉద్గాతచేయు పనులను లాట్యాయన ద్రాహ్యాయణాది శ్రౌతసూత్రములు తెలుపును.

ఋగ్వేదములోని ఋక్కులను గూర్చి చెప్పుచు నిరుక్త కారుడైన యాస్కమహాముని యిట్లనెను.

"యత్కామ ఋషిర్యస్యాం దేవతాయా మార్థపత్య మిచ్ఛన్ స్తుతింప్రయుంక్తే తద్దైవతః సమంత్రో భవతి" ఏ కోరిక గలిగిన ఋషి ఏ దేవతయందు "ఎవడు ఈ యర్థమునకు ప్రయోజనమునకు ఆధిపత్యమును ప్రభుత్వము కోరుచు ఏ స్తుతినిచేయుదునో" ఆ స్తుతిగలమంత్రము ఆ దైవతముగలదగును అని. ఇంకను ఆ దేవతలను గురించి విస్తరించి యాస్కుడు ఇట్లు చెప్పెను.

దేవతలెందఱు

"తిస్రఏవ దేవతా ఇతి నైరుక్తాః అగ్నిః పృథివీస్థానో వాయుర్వేంద్రోవా అంతరిక్ష స్థానః, సూర్యోద్యుస్థానః" ఇతి.

నిరుక్తకారులు "ముగ్గురే దేవతలు" అని యందురు. అందు అగ్నికి భూమి స్థానము, వాయువునకుగాని, వర్షాదిదేవతయైన యింద్రునికిగాని భూమి పైభాగము స్థానము. సూర్యునికి దివము ఆకాశము స్థానము. అగ్ని మొదలగునవి జడములుకావు అధిదేవతలు. ప్రపంచమునకు భగవంతుడు అధిదేవతయైనట్లు అగ్ని మొదలగువానికి అధిపతులగువారె అధిదేవతలు.

ఏకస్యాత్మనోఽన్యేదేవాః ప్రత్యంగాని భవంతి (నిరుక్త. దైవతము 7) ఒక ఆత్మకు ఇతరదేవతలు అంగములవంటివారు. దేవతలు మహాభాగ్యము గలవారు కనుక ప్రకృతినిబట్టియు ప్రకృతినతిక్రమించిన స్థితిఁబట్టియు చేతనాచేతన వికరణధర్మముగలవారుగాన తన యాత్మను అనేక విధవికారములు గలుగునట్లు చేసికొందురు. ఒకరికొకరు అంగములుగా గూడనందురు. అగ్ని ఇంద్రుడు

సూర్యుడు పరస్పరము ఒకరినొకరు స్తుతించుకొందురు. అంగములను అపేక్షించక ప్రత్యంగములుండవు. కనుక అగ్నీంద్ర సూర్యాత్మకమైన దేవతాత్మకు జాతవేదుడు వాయువు భగుడు మొదలగువారు ప్రత్యంగములు శకునులు మొదలగునవి కూడ ప్రత్యంగములు. అయా గొప్ప యుత్తమ అగ్నీంద్ర సూర్యాద్యంగ ప్రత్యంగభావముచే వ్యూహము ననుభవించుచు ఒక్కడైనను అనేక విధములుగా స్తుతింపఁబడును. దేవతలు మహాభాగ్య యుక్తులగుటచేత సర్వనామములచే స్తుతింపబడుదురు. వారు ఇతరేతరజన్మలకు కారణమై ఒకరి కొకరు ప్రకృతులుగాను, వికృతులుగాను కాగలరు. మనుష్యులలో తండ్రివల్ల ననే పుత్రుడు కలుగును. దేవతలలో అట్లుగాదు, తేజోరూపుడైన అగ్నినుండి సూర్యుడును, సూర్యునినుండి అగ్నియును శక్తిరూపిణియగు నదితినుండి దక్షుడు శక్తుడైన దక్షునినుండి అదితియుకలుగును. వారు సర్వశక్తిమంతులు కర్మఫల సిద్ధికొఱకు లోకమునను గ్రహించుటచే అగ్నివాయు సూర్యులు అగుదురు. తమ యాత్మయే కార్యమును కారణమునుఅగును. ఆత్మనుండి అన్నియు నగుచుండును. ఆత్మయే వీరికి రథము, ఆయుధము, బాణములు అన్నియు. వీరు మహాభాగ్యము ఐశ్వర్యముగలవారుగాన వారొక్కరే అనుకొన్నను అన్ని రూపములు గలవారు కాగలరు. (నిరుక్తము దైవతకాండము 1-7-5- 0, 1 12, 13, 14, 15.)

"ప్రజాపతిస్త్రీన్ మహిమ్నో ఒసృజత అగ్నిం వాయుం సూర్యం" ఇతి (శ్రుతిః) ప్రజాపతి మూడు మహిమలనుండి అగ్నిని, వాయువును, సూర్యుని సృజించెను.

"తాసాంమహాభాగ్యా దేవైకస్యా అతి బహూని
నామధేయాని భవంతి అపి కర్మ పృథక్త్వాత్"

ఆ దేవతలు మహాభాగ్యముకలవారు గనుక ముగ్గురన్నను అనేక నామములు అనేక కర్మలనుబట్టి కలుగును. తమ్ము అనేకముగా విభజించుకొని అన్నియు చేయుగలరు. (నిరుక్త 7-5-4)

"ఇంద్రం మిత్రం వరుణమగ్ని మాహురథదివ్యః సువర్ణో గరుత్మాన్ ఏకం సత్ విప్రాబహుధా వదంతి అగ్నింయమం మాతరిశ్వానమాహుః" (ఋగ్వేదం 2, 3, 22, 6) ఇంద్రునిగా మిత్రునిగా వరుణునిగా అందురు. అతడు దివ్యుడు సువర్ణుడు గరుత్మంతుడు ఒకనినె విప్రులు అగ్నినిగాను యమునిగాను వాయువుగాను చెప్పుదురు.

ఆ ఋక్కులను గురించి యాస్కముని యిట్లనెను.

ఋక్కులెన్ని విధములు

"తాస్త్రివిధా ఋచః, పరోక్ష కృతాః, ప్రత్యక్ష కృతాః ఆధ్యాత్మికశ్చ" ఆ ఋక్కులు మూఁడు విధములై యున్నవి. ఒకటి పరోక్షముగఁ జేయఁబడినవి. రెండు దేవతలను ప్రత్యక్షముచేసికొని చేయఁబడినవి. మూఁడు అధ్యాత్మ విషయములను దెలుపునవి.

తత్ర పరోక్షకృతాః సర్వాభిర్నామ విభక్తిభిర్యుజ్యంతే ప్రథమ పురుషైశ్చాఖ్యాతస్య" అందు పరోక్ష కృత ఋక్కులు అన్ని సుబంత పదములచేత అనఁగా అన్ని విభక్తులచేతను ఆఖ్యాత అనఁగా తిఙంత క్రియా పదములోని ప్రథమ పురుషలచేతఁ గూడియుండును. అని. ఇంక ఆ విభక్తులు గల ఋక్కులు ఈ క్రింది విధముగా యాస్కునిచే నుదాహరింపఁబడినవి.

పరోక్ష కృతఋక్కులు

ఇంద్రో దివ ఇంద్ర ఈశే పృథివ్యాః। ఇంద్రో అపా మింద్ర ఇత్పర్వతానాం, ఇంద్రో వృధా మింద్ర ఇన్మేధిరాణా మింద్రః క్షేమే యోగే హవ్య ఇంద్రః" (ఋ. సం. 8-4-15-5)

ఇంద్రుఁడు దివమునకుఁ బృథివికి ఈశుఁడనుచున్నాఁడు. ఇంద్రుఁడు నీళ్ళకు ఇంద్రుఁడె పర్వతములకు అనఁగా మేఘములకు (పర్వతములు-మేఘములు వైదికనిఘం. 1-10-9) ఇంద్రుఁడు వృద్ధిపొందిన పంచభూతములకు, ఇంద్రుఁడె మేధగలవారికి, ఇంద్రుఁడే క్షేమమందు యోగమందు (ప్రభువగుచున్నాఁడు) ఆహ్వానింపఁదగినవాఁడు. ఈ ఋక్కు ప్రథమా విభక్త్యంతము. ద్వితీయా విభక్తిలో-అగ్ని మీళే, పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం హోతారం రత్నధాతమం. ( ఋ. 1, 1, 1, 1. ) యజ్ఞమునకుఁ బురోహితుఁడును, దేవుఁడును, ఋత్విక్కును, దేవతలను ఆహ్వానించువాఁడును రత్నములను (రమణీయ వస్తువులను) ధరించువారిలో శ్రేష్ఠుఁడునైన అగ్నిని స్తుతించుచున్నాను. ఇట అగ్నిం అని ద్వితీయా విభక్త్యంతము.

ఇంకొక యుదా:- ఇంద్ర మిద్గాథినో బృహత్ ఇంద్ర మర్కేభి రర్కిణః ఇం ద్రం వాణీ రనూషత" (ఋ. 1-1-13-1) ఇంద్రునినె ఓ గాథులారా! (సామ గానకర్తలగు నుద్గాతలార!) బృహత్సామచేతను, ఇంద్రుని అర్కములచేతను (ఋక్కులచేతను) అర్కులారా! (ఋక్కులుగల హోతలార!) వాణులచేత (యజుర్వాక్కులచేతను) అనుసరించి స్తుతింపుఁడు. ఇక్కడఁ గూడ ఇంద్రం ఇంద్రం అనునది ద్వితీయాంతము.

తృతీయ కుదా:- ఇంద్రే ణై తే గృత్సవో వేవిషాణాః" (ఋ. 5-2-28-5)

చతుర్థికదా:- ఇంద్రాయ సామగాయత (ఋ. 6. 7. 1. 1) ఇంద్రుని కొఱకు సామమును గానము చేయుఁడు.

పంచమికుదా:- నేంద్రా దృతే పవతే ధామ కించన (ఋ. 7. 2-22-1) ఇంద్రు నుండి విడిచి (ప్రాతస్సవ నాదులతో) ఏస్థానముగూడ వెళ్ళదు.

షష్ఠికుదా:- "ఇంద్రస్యను వీర్యాణి ప్రవోచం (ఋ. సం 1. 2. 36. 1) ఇంద్రునియొక్క వీర్యములను శీఘ్రముగా నెక్కువ చెప్పుచున్నాను.

సప్తమి కుదా:- "ఇంద్రే కామా అయంసతే" ఇంద్రునియందు కోరికలు నిబద్ధమై యున్నవి.

ప్రత్యక్షకృత ఋక్కులు- ఇంక ప్రత్యక్షకృతములైన ఋక్కులు మధ్యమ పురుషక్రియలు గలిగి త్వం (నీవు) అను సర్వనామముచేఁ జెప్పఁబడినవి.

" త్వమింద్ర బలా దధి (ఋ. సం. 8-8-1.-2)"
నీవు ఇంద్రా! బలమువల్ల అధికుఁడవై యుంటివి.
"వి న ఇంద్ర మృధో జహి (ఋ. 8-8-10-4)
విశేషముగా మా యొక్క శత్రులను ఇంద్రా! నశింపఁజేయుము.

మఱియు ప్రత్యక్ష కృతములైన ఋక్కులను గూర్చి స్తోత్రము చేయు వారుందురు. పరోక్షకృత ఋక్కులు స్తుతింపఁదగి యుండును.

"మాచిదన్య ద్వి శంసత" (ఋ, 5-7-20-1.)
( ఓ సఖులారా! ఇంద్రస్తోత్తము కంటె ) అన్యస్తోత్రమును వివిధముగా శంసించుఁడు.

"కణ్వా అభి ప్రగాయత" (ఋ. 1-3-12-1)

ఓ కణ్వశాఖులారా అంతటను ప్రగానము చేయుండు.
"ప్ర ప్రేత కుశికాశ్చేత యధ్వం" (ఋ. 3-3-21-1)
ఓ కుశిక గోత్రులారా! దగ్గరకు రండు తెలిసికొనుండు.

## ఆధ్యాత్మిక ఋక్కులు

మఱి యింక ఆధ్యాత్మిక ఋక్కులు ఉత్తమ పురుష క్రియను గూడి యుండును. 'అహం' నేను అను సర్వనామముతో సంబంధము గలిసి యుండును.

ఉదా:- అహం భువం వసునః పూర్వ్యస్పతి
రహంధనాని సంజనయామి శశ్వతః (ఋ 8-1-5-1)

నేను (ఇంద్రుడను) ధనమునకు ముఖ్యమైన ప్రభువును, నేను శత్రు సంబంధియగు ధనములను కూడ జయింతును.

ఇతివా ఇతిమే మనో గా మశ్వం సనుయామితి
కు విత్ సోమస్య అపామితి (ఋ. 8-6-2 -1)
ఇట్లని నామవస్సు గోవును గుఱ్ఱమును ఇచ్చెదను.
చాల సార్లు నేను సోమము త్రాగితిని.

అహం రుద్రేభిర్వసుభిశ్చరామ్యహ మాదిత్యైరుత
విశ్వేదేవైః అహం మిత్రా వరుణోభా బిభర్మ్య మహ మింద్రాగ్నీ
అహ మశ్వినోభా. (ఋ 8-7-11-1)

"నేను ఏకాదశ రుద్రరూపముగా అష్టవసువుల రూపముగాఁ జరింతును. ఆదిత్యరూపముగా విశ్వదేవ రూపముగాఁ జరింతును. నేను మిత్రావరుణు లిద్దఱను భరింతును. ఇంద్రాగ్నులను భరింతును."

## అగ్న్యాది వాయ్వాదులు జడములు కావు

ఈ విధముగా పరోక్ష కృతములైన ఋక్కులును, ప్రత్యక్ష కృతఋక్కులును అధికముగా నున్నవి. ఆధ్యాత్మికములు స్వల్పములు. స్తుతులతోపాటు ఆశీరాదులను ఋక్కులందు చెప్పఁబడినవి. ఆధునికులీ విషయములో ఈ ఋగాదులన్నిటిలోను అగ్న్యాది జడములనుద్దేశించి స్తుతించుటయు వానిని

సంబోధించియు సోమపానాదులకై ఆహ్వానించుటయుఁ జెప్పఁబడినది గదా. ఇట్లు స్తుత్యాదులు చేతనముల విషయమై యుక్తముగాని జడముల విషయమై చేయుట సంభవించుట యెట్లు? ఇది యున్మత్తాదుల పనులుగావా అని యందురు.

అగ్న్యాదులందు దేవుఁడు నిగూఢముగా నున్నాఁడు

ఈ విషయమును గూర్చి పరిశీలింతము. అసలు భారతీయ ఋషుల దార్శనికుల సిద్ధాంతము సర్వము బ్రహ్మమయమని, ఆత్మమయమనియు. చైతన్యమయము కానిది లేదనియె సర్వం ఖల్విదం బ్రహ్మ, ఇదంతయు బ్రహ్మమె అను నుపనిష్మహా వాక్యమీ సంగతిని తెలుపుచున్నది. "ఈశా వాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్" మారుచున్న యీ జగత్తంతయు ఈశునిచే వ్యాప్యమై యున్నది.

"యోదేవోఽగ్నౌ యోఽప్సుయో విశ్వంభువన మావివేశ
యఓషధీషుయోవనస్పతిషు తస్మై దేవాయ నమో నమః
(శ్వేతాశ్వతరోపనిషత్. 2-17)

ఏ దేవుఁడు అగ్నియందు, ఏ దేవుఁడు నీళ్ళలోను సమస్త భువనమును ఆవేశించి యుండెనో ఎవఁడు ఓషధులందు వనస్పతులందు ఉండెనో ఆ దేవునికి నమస్కారము నమస్కారము" అనియు శేతాశ్వరోపనిషత్తు చెప్పుచున్నది. దీనినిబట్టి అగ్న్యాదులందున్న దేవుని స్తుతించినట్లును అట్టి దేవుని పిలిచినట్లును భావింపవచ్చును. లేక దేవుడు నిండియున్న యగ్న్యాదులును దేవతా స్వరూపములె చైతన్యములె గాన వానిని స్తుతించుట ఆహ్వానించుట యుక్తమె అనియును మనము భావింపవచ్చును. మనకు భౌతికేంద్రియములకుఁ గనిపింపని పరమేశ్వరుని గూడ నిట్లే పిలుచుచు మన కోరికలు తీర్చుమని, రక్షింపుమని కోరుచున్నాము గదా.

జడములుగా, దోచు మన శరీరములు గూడ ఆత్మతో నిండి యుండుటచే అవి చైతన్యములుగాఁ దోచు నట్టి పరమేశ్వరాధిష్ఠితములగు భూమ్యాదులును చైతన్యములె. వాని నట్లు తలచి పూజాదులలో సమర్పించుట యుక్తమె.

"ద్వేవావ బ్రహ్మణే రూపే మూర్తంచాఽమూర్తంచ
మర్త్యం చామృతంచ స్థితంచ యచ్చ సచ్చత్యచ్చ, (బృ. 10-2)

బ్రహ్మకు రెండు రూపములు గలవు. మూర్తిగలది మూర్తి లేనిది అని మర్త్యము అమృతము. ఉన్నదియు అది యిదియంతయు బ్రహ్మమే అని దీనిని బట్టి మనము దేనిని జడములనుకొనుచున్నామో అవి జడములు కావని యు వానిలోని నిగూఢమై యున్న దైవతత్త్వమును దెలిసికొనలేకున్నామని తేలుచున్నది. మంత్రద్రష్టలగు ఋషులు అగ్న్యాదులందున్న దైవతత్త్వములను సాక్షాత్కారము చేసికొని వానితో బ్రత్యక్షముగా మానవులతో మాటాడుచున్నట్లు-మాటాడి తత్ఫలితములను బొందిరి.

వేదములు సుస్వరముగా నేల చదువవలెను?
అవిఏల ఫలించుటలేదు?
మంత్రో హీనః స్వరతో వర్ణతోవా మిథ్యాప్రయుక్తో నతదర్థమాహ
సవాగ్వ్రజో యజమానం హినస్తి యథేంద్ర శత్రుః స్వరతోఽపరాధాత్,

మంత్రము స్వరమునుబట్టిగాని వర్ణమును బట్టి గాని సరిగా ప్రయోగింపఁబడకపోయినందువల్ల దానియర్థమును సరిగాఁజెప్పలేదు. అట్లు చెప్పనందువల్ల ఆ అశుద్ధమైన వాక్కు అనెడి వజ్రాయుధము యజమానుని చంపును. ఎట్లనగా, ఇంద్రశత్రువు అను పదము ఋత్విక్కుయొక్క స్వరాపరాధము వల్ల అనిష్టము జరగెను. "ఇంద్రశత్రుర్వర్ధస్వ" ఇంద్రుని శమింపఁజేయువాఁడవై వృద్ధిపొందుము అనుభావముతో నింద్రుని జంపునట్టి పుత్రుని వృత్రుడనువానిని గొనుటకై త్వష్ట ఆభిచారిక యాగమును జేసెను. కాని యిక్కడ ఇంద్ర శత్రుశబ్దములో తత్పురుష సమాసమునుబట్టి అంత్యోదాత్త స్వరను పల్కుటకు బదులు ప్రమాదముచే ఆద్యుదాత్తస్వరము పలుకఁబడెను. అపుడు పూర్వపద ప్రకృతి స్వరముచే శమింపఁజేయువాఁడుగాఁ గల ఇంద్రుడవై వర్ధిల్లుము. అను బహువ్రీహ్యర్థము వచ్చినది. అప్పుడు ఇంద్రుఁడె హింసకుఁడయ్యెను. అని యోగదర్శన ద్రష్టయు మహాభాష్య కర్తయునైన అంతటి పతంజలి యుదాహరించెను. అనఁగా మంత్రములలోఁ జెప్పబడినదిట్లు సరిగా జరగెను. నేఁడు మనము మంత్రములకు చింతకాయలు రాలునా అని పరిహాసముతో మంత్రములను నిందించు స్థితికి వచ్చితిమి. పతంజలి అట్లు ఉదా

హరించుటనుబట్టి సరిగా మననము చేయుటచే మంత్రములు మనలను రక్షించుట యన్నది ప్రత్యక్ష విషయముగా అప్పటి మహర్షుల యనుభవములో నున్నట్లు స్పష్టమగుచున్నది. సరే సరిగాఁ జేయనప్పుడు ఫలింపలేదనుటలో అయుక్తమేమున్నది. ఇంతకు మనము పైవానిని బట్టి గ్రహింపవలసిన దేమనఁగా మంత్రములు నేఁడు ఫలింపకపోవుటలో మనదే దోషమని తేలుచున్నది.

ఋషులు మంత్రద్రష్టలు

కనుక మంత్రద్రష్టలు అగ్ని మొదలగువానితో ప్రత్యక్షముగా మాటాడినట్లు ఋక్కులు మనకుఁ దెలుపుచున్నవి. అట్టి ఋక్కులు ఉన్మత్తభాషితములు గావనియు సర్వపదార్థములలో దైవత్వములను ప్రత్యక్షముగా జూచిన మన పూర్వ మహర్షుల మహత్త్వమును దెలిసికొని మనమును ఆ దైవతమహత్త్వమును దెలిసికొని వారి కృపకుఁ బాత్రులము గావలెననియు గ్రహింపవలసియున్నది.

ఈ దృష్టితోఁ జూచినచో మనకు ఋగ్వేదాది విషయముల గొప్పదనము తెలియును. కనుకనే దేవతలను యజ్ఞభుజులని యందురు. వారు యజ్ఞములందలి యాహుతులచే (ఆహ్వానములచే) అచ్చటి యాగశాలలకు వచ్చి యజ్ఞభాగములను గ్రహింతురు. రామాయణములో దశరథుఁడు పుత్రకామేష్టి యాగము చేసినపుడు యజ్ఞభాగములను గ్రహించుటకు దేవతలు వచ్చి రావణునివల్ల కలుగు బాధలను బ్రహ్మతోను, విష్ణువుతోను జెప్పుకొనుటయు వాస్తవిక విషయములని మనకుఁదెలియును.

దేవతలు నైవేద్యములు తినరు.

సరే ఆ వచ్చిన దేవతలు మనమర్పించు నైవేద్యములను గ్రహింపరేమి అని సందేహము గలుగవచ్చును. "న వై దేవా అశ్నంతి న పిబంత్యేత దేవామృతం దృష్ట్వా తృప్యంతి" (ఛాందో 3-6)
దేవతలు భుజింపరు త్రాగరు. ఈ నైవేద్యరూపమైన యమృతమును చూచి తృప్తి పొందుదురు." అని ఛాందోగ్యము చెప్పుచున్నది. అనఁగా మనమర్పించునవి వారు తినకయె చూచియె తృప్తి పొందుదురని భావము. మనము

చేయునవి చూతురు, విందురు. కాని మనము చేయు సద సత్కార్యములకుఁ గోపపడక, సంతోషింపక మన కార్యములకుఁ దగిన ఫలితములే యిచ్చెదరని మనము గ్రహింపవలెను. వారు సమవర్తులు, పక్షపాత రహితులు, కృపామయులు.

అగ్నినా రయి మశ్నవత్ పోష మేవ దివే దివే యశసం వీరవత్తమం (ఋ. 1-1-'-3)

అగ్నిచేత మానవుఁడన్నము, ధనము పొందుచున్నాఁడు. పుష్టిని గీర్తిని అతి వీర్యమును రోజురోజు పొందుచున్నాఁడు. అను ఋక్కులో అగ్నివల్ల మానవు డెట్టి గొప్పఁదనము పొందఁగలఁడో చెప్పఁబడినది. అగ్ని అంతటివాఁడు అగ్నిని గుఱించి చెప్పుచు "అగ్నిర్ముఖం ప్రథమో దేవతానాం" (ఐ. బ్రా. 1-4) అగ్ని దేవతలకు ముఖమని దేవతలలో మొదటివాఁడని ఐతరేయబ్రాహ్మణము చెప్పుచున్నది. " ఏకం సద్విప్రా బహుధా వదం త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః" (ఋ. 1- 64-46) ఆ యొక్క వస్తువునే (పరమాత్మనే) విప్రులు అనేక విధములుగాఁ జెప్పుదురు. ఆ పరమాత్మనే అగ్నినిగాను, యమునిగాను, వాయువుగాను జెప్పుదురు, అని ఋక్కు చెప్పుచున్నది. "అయంవావ అగ్నిః ప్రజాః ప్రజాపతిశ్చ" (శత. 6-1-2-42) ఈ యగ్నియె ప్రజలను ప్రజాపతియు" అని శతపథ బ్రాహ్మణము. అగ్ని పదమునకు అగ్రేనయతి అగ్రమందు నడుపువాఁడు ఈశ్వరుఁడు అగ్నిదేవుఁడును" అని దానికి వ్యుత్పత్తియు చెప్పుదురు. ఇట్లు అగ్నిలో నిండియున్న దేవత్వమును మన ఋగ్వేదము గీర్తించినది. మన ఋషులు ఆ యగ్నిని దర్శించి స్తుతించిరి. మన వంటి సామాన్య మానవులము అగ్నిని దైవముగా దర్శించకపోయినను అగ్నివి ఆ తేజస్సును మన నిత్యజీవితములో జడముగాఁ దలఁచినను అది సర్వకార్య దక్షమైనదిగాను అది లేకపోయినచో ప్రపంచమంతయు శూన్యమై అంధకార బంధురమైనదిగా మనమును అనుభవములో జూచుచున్నాము. అట్టి సర్వ కార్య దక్షమైన యగ్నిని జడమని మనము దైవముగాఁ దలఁచకపోవుటలో మన యజ్ఞానమే కారణమని చివరకు నొప్పుకొనక తప్పదు.

"ఓం తత్సత్పరమాత్మనే నమః, ఓం శం వరుణః, శంనో భవత్వర్యమా. శం వ ఇంద్రో బృహస్పతిః, శంనో విష్ణురు క్రమః, నమో బ్రహ్మణే, నమస్తే

వాయోత్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి. త్వామే న ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి. ఋతం వదిష్యామి సత్యం వదిష్యామి. తన్మా మవతు. తద్వక్తార మవతు అవ మమాం అవతు వక్తారం. ఓం శాంతిః శాంతిః శాంతిః" ఓంకార స్వరూపమైన పరమాత్మకు నమస్కారము. ఓంకార స్వరూపుఁడైన వరుణుఁడు మాకు శుభ మిచ్చుఁగాక. మాకు అర్యముఁడు (సూర్యుడు) శుభమిచ్చుఁగాక. ఇంద్రుఁడు బృహస్పతియు మాకు శుభమిచ్చెదరు గాక. ఉరు విక్రమముగల విష్ణువు మాకు శుభమిచ్చుఁగాక. బ్రహ్మమునకు నమస్కారము. ఓ వాయువా! నీకు నమస్కారము. నీవే ప్రత్యక్షమైన బ్రహ్మవు. నిన్నే ప్రత్యక్షమైన బ్రహ్మనుగా చెప్పుదును. ఋతమును (ఆచరణమైన సత్యమును) పలుకుదురు. సత్యమును పలుకుదును. అది నన్ను రక్షించునుగాక. అది సత్యము పలుకువానిని రక్షించు గాక. నన్ను రక్షించుఁగాక. సత్యము పలుకువానిని రక్షించునుగాక. ఓం శాంతి శాంతి శాంతి గలుగుఁగాక." అని మహర్షులు శాంతిమంత్రమును గీర్తించిరి. అందు ప్రాణధారకమైన వాయువును పరమాత్మగాఁ గీర్తించిరి. దానిని మనము జడమనుకొన్నను అది మనకు ప్రాణప్రదమై యున్నదే. జడమైన మన శరీరమునకు ప్రాణమిచ్చునట్టి వాయువును జడముగాఁ దలఁచు మన యజ్ఞానమె వెల్లడియగుచున్నది. అందుకనే మన మహర్షులు అగ్న్యాదులను జడమనుకొను మన యజ్ఞానమును పోగొట్టుటకును అగ్నిని వాయువును అన్న ప్పుడీ అగ్నిలోనున్న యధిదేవతను వాయ్వాదులందున్న యధిదేవతనుగాఁ జెప్పినారు. ఋగ్వేదము అగ్నీంద్రాదులను స్తుతింపఁగా యజుర్వేదము యజు స్సులచే (పూజాదులను దెలుపు మంత్రములచే) యజించినది పూజించినది. ఆ పూజయే యజ్ఞమైనది. అగ్న్యాదులను సామవేదము వారి గుణగణాలను గానము చేసినది. అథర్వవేదము మన శుభములకు మార్గము చూపినది.

## యజుర్వేదము

"ఇషే త్వో (త్వా-ఊ) ర్జే త్వా" (యజు. 1-1-1-1)
(ఓ మోదుగు కొమ్మా) అన్నముకొఱకు నిన్ను బలమునకు నిన్ను (నఱకు చున్నాను.) మోదుగుచెట్టులో గర్భితమైన అన్న బలాది శక్తులఁజూపి యజుస్సు అగ్న్యాదులను పూజలకు బాహ్యరూపమైన యజ్ఞముచేఁ బూజించుచున్నది. "వాయవః స్థో (స్థ-ఉ) పాయవః స్థ" (ఓ గోవత్సములారా! మీరు లేగడ్డిఁ

దినుటకు మీ తల్లుల దగ్గరనుండి వనమునకు) వెళ్ళుడు. మఱలఁ దిరిగి (యింటికి) రండు. అగ్నీంద్రాదులను గోఘృతాహుతులద్వారా అగ్నిని ముఖముగాఁ జేసికొని యజ్ఞకర్త పిలుచుచుఁ బూజించుచున్నాఁడు. చేతనములైనను అజ్ఞానముచే జడములుగా భావించు వృక్షాదులలో మోదుగు వృక్షము శ్రేష్ఠము. దానిలోని గర్భితమైన అన్నబలాదులను మనము పొందుటకై అగ్నీంద్రాదుల యనుగ్రహమును గోరుచు అగ్నీంద్రాదుల యనుజ్ఞను యజ్ఞమును (దేవపూజను) చేయు యజమానుఁడు యజించుచున్నాఁడు. గోవులు కేవలము "ఆయుర్ఘృతం" నేయియె యాయువు అని చెప్పఁబడు నేయి మనకు మాత్రమె యిచ్చునవి గావు మనద్వారా అగ్నీంద్రాదులకు ఆహుతులను ఇచ్చునవి. అవి క్షీరదాతులు మాత్రమె గావు. అవి హోమధేనువులు, అవి దేవపూజకై పాలు నేయి యిచ్చుచున్నవి. కాన వాని సంతానము గోవత్సలు సుఖముగా జీవించుటకై మనము వత్సములను పచ్చని బయళ్ళకు, వనములకుఁ బంపుచున్నాము. మనము కూడ దేవతల పూజకై ఆహుతులకై (దేవతాహ్వానములకై) సరిపోవు క్షీరములను మాత్రమె గ్రహించుచున్నాము. మనము గోవులను తృణజలాదులద్వారా పోషించుచున్నాము గావ మనమును ఆహుతులకు, మనదధిఘృతములకును దూడపోషణకు హానికలుగనంతమాత్రమె గైకొనుచు ఇంకను వాని యాహారమునకే లోటు వచ్చునో యని వానిని లేతదిమ్మె త్తనిడి సర్వాహార మూలమునగు తృణములతో నిండిన వనములకుఁ బంపి తిరుగ గోమాత దగ్గఱకుఁ దీసికొని వచ్చుచున్నాము. దీనిలో మన పవిత్రహృదయము ఏ ప్రాణికి స్వల్పహింసనుగూడ గోరని మన మనస్సును వ్యక్తమగుచున్నది. కనుకనే "దేవోవః సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణే" దేవుఁడైన సూర్యుఁడు శ్రేష్ఠతమమైన కర్మకై మిమ్ము ప్రేరణ చేయుఁగాక. అని యజమానుఁడు జడములని యజ్ఞానముచే చరించు మన యజ్ఞానమును పోగొట్టుటకై అఘ్న్యాదులందు దైవత్వమును గ్రహించు మహర్షులు చేతనములైన గోవులతో మాటలాడుచున్నారు. మన భాష గోవులకు అర్థముగాదని మనమనుకొన్నను మన ప్రేమవర్తనఁబట్టి మన భావమును గోమాతలు గ్రహింపకపోవు.

వ్యాసశిష్యుఁడు వైశంపాయనుడు యాజ్ఞవల్క్యాదులగు శిష్యులకు యజుర్వేదమును చెప్పెను. ఒకప్పుడొక కారణముచే కోపగించి గురువు తన వేద

మును తనకిచ్చి వేయుమనగా యాజ్ఞవల్క్యుడు వానిని క్రక్కి వేయగా దేవతలు తిత్తిరి పక్షులై వచ్చి వానిని మరల సమర్పించగా అవి కృష్ణములుకాగా అవి కృష్ణ యజుర్వేదమనబడెను. పిదప దుఃఖించి యాజ్ఞవల్క్యుడు సూర్యునుపాసించి శుక్ల యజుర్వేదమును పొందెను. అది శుక్ల యజుర్వేదము, యాజ్ఞవల్క్యుడు మరల జాబాల గౌధేయ కాణ్వమధ్యంది నాదు లనుస ప్తదశ శిష్యులకుపదేశించెను. అవి 42 శాఖలు. వానిలో మైత్రాయణీయ మాధ్యందినీ కాణ్వ తైత్తిరీయ అను పేరుగల బౌఖ్యా ఆపంస్తంబ అను 5 శాఖలున్నవి.

## సామవేదము

అగ్న ఆయా హి పీతయే గృణానో హవ్య దాతవే నిహోతా సత్సి బర్హిషి" (సామ. 1-1-1-1)

ఓ యగ్నీ! సోమపానముకొఱకు రమ్ము. హవ్యభక్షణకై స్తుతింపఁబడుదువు. దేవతలను బిల్చువాఁడవై వచ్చి దర్భలపైని గూర్చుండుము.

త్వ మగ్నే యజ్ఞానాం హో తా విశ్వేషాం హితం దేవేభిర్మానుషే జనే। (సామ. 1-1- -2)

ఓ యగ్నీ సర్వయాగములకు హోతవు (ఆహ్వాన కర్తవు) హితుఁడవు. మానవ జనులకై నీవు దేవతలచే నియోగింపఁబడితివి. సామవేదమునకు 13 శాఖలు గలవు. సహస్రశాఖా ప్రవాదము బహువిధ స్వరాది సంయోగమువలన ఒకే మంత్రమునకును బహువిధ సామశృతివలన గలిగినదే. రాణాయణ, శాట్యముగ్న్యః వ్యాసబాగురి ఔల్కుండి మేల్గులని భానుమానౌ పమన్యవ, కౌరాటి, మశకోగార్గ్య వార్షగణ్య కుదుమ శాలిహోత్ర జైమిని అని వారు సామగానాచార్యులు వానిలో రాణాయణ, కౌథుమి, జైమిని అను మూడు శాఖలు ఇప్పటికిని గలవు.

## అథర్వ వేదము

నవాధ్యాథర్వణోఽన్యేతు ప్రాహుః పంచదశాధ్యకం. శంనో మిత్రః శం వరుణః శంనో భవతు అర్యమా శంన ఇంద్రో బృహస్పతిః ఇత్యాదులు.

అధర్వవేదములో తొమ్మిది భేదములున్నవి. పైప్పలదాంత, ప్రదాంత, స్నాత, స్రౌత బ్రహ్మదాబల, శౌనకి దేవదర్శతి, చరణవిద్య అని. ఇన్నిటిలో ఒక శాఖయే ముద్రితము.

అగ్న్యాదులందలి దైవత్యమును ఋషులు దర్శించిరి, ప్రాణులలో నున్న ఆత్మ బాహ్యనేత్రములకుఁ గనిపింపనట్లు అగ్ని జలాదులందున్న దేవ తత్త్వము మన బాహ్యేంద్రియములకు గోచరము కాదు. అట్టి దైవతత్త్వ మును పంచభూతములలో నిగూఢమై యున్నదానిని ఋషులు దర్శించి వారితో ప్రత్యక్షమువలె భాషించిరి.

ఓమ్ ఆపోహి ష్ఠా మయోభువః తా నఊర్జే దధాతన మహే రణాయ చక్షసే యోవశ్శివ తమో రసః తస్య భాజయతేహ నః ఉశతీరివ మాతరః తస్మా అరంగమామ వో యస్య క్షయాయ జిన్వథ. ఆపోజనయథా చ నః (తై. అర. 4-42)

ఓ జల దేవతలారా! సౌఖ్యముచే కూర్చుందురు గాక. మీయన్నరస మనుభవించుటకు రమ్యమైన మీ గొప్పదర్శన భాగ్యము పొందుటకు మమ్ము నిల్పుదురు గాక ప్రేమగల తల్లులవలె మీరు కళ్యాణమైన మీ రసమున కిక్కడ మమ్ముఁ బాత్రులఁ జేయుఁడు. ఆ రసము పొందుటకు మిమ్ము మాటిమాటికి చేరుచున్నాను. జలదేవతలారా! మమ్ము శక్తిమంతులఁ జేయుఁడు.

ఇమం మే వరుణ శ్రుధీహవమద్యా చ మృడయ త్వా మవస్యు రాచకే తత్త్వా యామి.

ఓ వరుణదేవా! ఈ నా యాహ్వానమును వినుము. ఇప్పుడు నన్ను బంధముక్తుని జేయుము. ఆత్మ రక్షణార్థినై నిన్నుఁ బ్రార్థించుచున్నాను. (ఇది శునశ్శేపుడు చేసిన ప్రార్థన) ఈ ప్రార్థన విని వరుణుఁడు శునశ్శేపుని బంధముక్తునిఁ జేసెను. (ఋగ్వేద.)

అగ్నే నయ సుపథా రా యే అస్మాన్ విశ్వానిదేవ వయునాని విద్వాన్ యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాంతే నమ ఉక్తిం విధేమ (ఈశా.)

ఓ యగ్నిదేవా! మమ్ముఁ గర్మఫల భోగరూప ధనముకొఱకు మంచి

మార్గముగుండ నడపుము. నీవు సర్వకర్మలను జ్ఞానములెఱుగుదువు. మేము చేసిన పాపమును పోఁగొట్టుము. నీకు మిక్కిలి నమోవాకములు చేయుదుము.

తమలోని తమ యాత్మలనే చూడలేనివారిది యెట్లు చూడఁగలరు. తమ యాత్మలను చూడఁగల్గినప్పుడీ యగ్న్యాదులను ఎట్లు చూడలేరు. కనుకనే "వాయోత్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి" ఓ వాయువా! నీవే ప్రత్యక్షమైన బ్రహ్మవు" అని ఋషి పలుకుచున్నాఁడు. శరీరమే యాత్మయనెడి అనాత్మ వాదులగు నాస్తికులు చూడలేరు.

యాసాగ్ం రాజావరుణో యాతిమధ్యే సత్యానృతే
అవపశ్యం జనానాం మధుశ్చుత శ్చుచయోయాః
పావకాస్తా న అపఃశ్యం స్యోనాభవంతు

జలములకు రాజైన వరుణుఁడు జనుల సత్యాసత్యముల వివేచనచేయుచు వేనిమధ్య నుండెనో ఆ నీళ్ళు మధువును గురిపించుచు నిర్మలములై పవిత్రము చేయు నీళ్ళు మాకు శుభకరములగు గాక.

జలములలో అంతర్నిహితుఁడై యున్న వరుణదేవుని ఋషి స్తుతించు చున్నాఁడు.

త్వ మగ్నే యజ్ఞానాం హోతా విశ్వేషాం హితం దేవేభి ర్మానుషే జనే"
(సామ వే. 1-1-1-2)

ఓ యగ్నీ! సర్వయాగములకు హోతవు హితుఁడవు. మానవజనులకై నీవు దేవతలచే నియోగింపఁబడితివి. ఓం శం వరుణః శంనో భవత్వర్యమా.

ఈ విధముగా మహర్షులు అగ్న్యాదులను ప్రత్యక్షముగా దర్శించి వారితో మాటాడి వారి కృపకు పాత్రులైరి. ఋషులే గాక కవులుగూడ వృక్షముల లోని దేవతలను దర్శించిరి. అశ్వత్థము వృక్షరాజము శమి (జమ్మి) పరుల కష్టము శమింపఁజేయునది. శకుంతలను భర్తయింటికిఁ బంపుచుఁ గణ్వుఁడు "ఓ వృక్షములారా! శకుంతల భర్తయింటికిఁ బోవుచున్నది" సెలవిండు అని అనును. శకుంతల తాను పెంచిన మొక్కలదగ్గఱకుఁ బోయి "వెళ్ళివచ్చెదను" అని సెలవు తీసికొనును. ఇది కాళిదాస మహాకవి భావన. ఇది యెంతటి భావన. కనుకనే కాళిదాసాదులు కవులలో ఋషులు.

ఈ విధముగా మహర్షులు సమస్త ప్రపంచములోను దైవతత్త్వమును ప్రత్యక్షము చేసికొనిరి.

"అపి హ్యదేవతా దేవతావత్ స్తూయంతే, యథాఽశ్వ ప్రభృతీన్యోషధి పర్యంతాని" దేవతలుగానివి గూడ దేవతలవలె స్తుతింపఁబడును ఎట్లన, అశ్వములు మొదలు ఓషధులుగూడ స్తుతింపఁబడునని యాస్కుఁడు చెప్పెను.
(అధ్యా. పా. 1-404)

తిస్ర ఏవ దేవతా ఇతి నైరుక్తాః
దేవతలు ముగ్గురేయని నిరుక్తజ్ఞులు చెప్పుచున్నారు.

## అగ్న్యాదుల స్థానము

"అగ్నిః పృథివీస్థానో, వాయుర్వేంద్రోవా అంతరిక్ష స్థానః సూర్యోద్యుస్థానః"
అగ్ని భూమియె స్థానము గలది వాయువుగాని యింద్రుఁడుగాని భూమ్యాకాశముల మధ్య స్థానము గలవాఁడు.

పృథివ్యాం మనుష్యాః పశవో దేవా ఇతి స్థానైకత్త్వం చ సంభోగైకత్వం చ దృశ్యతే. (యాస్క.)

పృథివియందు మనుష్యులు పశువులు దేవులు ఒకే స్థానమందుందురు. సంభోగైకత్వమనఁగ పరస్పరోపకారిత్వను. కాన పృథివియందు మనుష్యులు పశువులు దేవులు ఒకరికొకరు ఉపకారము చేసికొనుచునుందురు. "యథా పృథివ్యాః పర్జన్యేన చ వాయ్వాది త్యాభ్యాం చ సంభోగః" ఎట్లనగా పృథివికి మేఘముతోను వాయు సూర్యులతోను పరస్పరోప కారిత్వము గలదు. "అగ్నినా చేతరస్య లోకస్య" ఇతర లోకమునకు అగ్నితో పరస్పరోప కారిత్వము గలదు.

మఱి దేవతాకారాదులకుగూడ మనుష్యాద్యాకారము లుండును. "పురుష విధాః స్యురిత్యేకం" దేవతలు పురుషులవలె నుండుట యొకటి. "అథాపి పౌరుష విధికై రంగైః సంస్తూయంతే" మఱియు పురుషసంబంధి విధులుగల యంగములతో దేవతలు స్తుతింపఁబడుదురు.

ఋష్వా (దర్శనీయౌ) త ఇంద్ర స్థవిరస్య బాహూ (ఋ. 8-7-31-3)
ఓ యింద్రా! పెద్దవాఁడవైన నీయొక్క బాహువులు దర్శనీయములు.
"ఆద్వాభ్యాం హరిభ్యా మింద్ర యాహి" (ఋ. 2-3-20-1)
ఓ యింద్రా! రెండు గుఱ్ఱములతో రమ్ము" (యాస్క. 7-2-6)

ఈ లోకముతో ప్రాతః సవనముతో వసంతఋతువుతో గాయత్రితో త్రివృత్స్తోమముతో రథంతర సామముతో భక్తిఁ గలన నేర్పడిన సాహచర్యము గలదు.

| దేవత | స్థానము | ఆకారము | భక్తి సాహచర్యములు | భార్యలు | చేయుకర్మ | స్తుతించు దేవతలు | పృథ్వి, లోకము ఆయతనాదులు. |
|---|---|---|---|---|---|---|---|
| అగ్ని<br>జాతవేదుడు<br>వైశ్వానరుడు | భూమి | అనేకాకారములు<br>పురుషాకారము<br>అపురుషాకారము | ఈ లోకము<br>ద్యులోకము<br>ప్రాతః సవనము<br>త్రివృత్స్తోమ<br>రథంతరసామము | అగ్నాయి<br>పృథ్వి<br>ఇల | హవిస్సుదాల్చుట<br>దేవతాహ్వానము | ఇంద్రసోమ<br>వరుణ, పర్జన్యులు<br>ఋతువులు | శరద్ అనుష్టుప్<br>ఏకవింశ<br>స్తోమము, వైరాజము, పంక్తి |
| వాయువు<br>ఇంద్రుడు | అంతరిక్షము<br>భూమ్యాకాశ<br>మధ్య | | అంతరిక్షము<br>మాధ్యందిన<br>సవనము<br>గ్రీష్మ, త్రిష్టుప్"<br>పంచదశ<br>స్తోము బృహత్ | అదితి మొ. | రసాను ప్రదానము<br>వృత్రవధ<br>బలకృతి | అగ్ని సోమవరుణ<br>బృహస్పతి<br>బ్రహ్మణస్పతి<br>విష్ణువాయువులు | హేమంతము<br>త్రిషవణము<br>శాక్వరసోమ |
| సూర్యుడు | దివము<br>అంతరిక్షముపైని | | ఈ లోకము<br>తృతీయ<br>సవనము<br>జగతి<br>సప్తదశ | ఉష, సూర్యా<br>వృషాకపాయి<br>సరయూ మొ<br>దేవపత్నులు | రసాదానము<br>రసధారణ<br>సంవత్సరము | చంద్రుడు<br>వాయు | శిశిరము<br>అతి ఛందస్సు<br>త్రయస్త్రింశత్<br>స్తోమ |
| సోముడు | అంతరిక్షము | | వైడూర్యస్తోమము | | | పూషరుద్రులు | దైవతస్తోమము |

సిద్ధుడు ప్రవరుని కాళ్ళకు రసము పూయుగా దాని మహిమచే అతడు హిమాలయమునకు పోయెను. అపుడు అక్కడ వరూధిని యను దేవకన్య ప్రవరుని కామించెను. నేను ఏకపత్నీ వ్రతుడను అని ఆమెను తిరస్కరించెను. తన కాళ్ళరసము మంచుచే కరిగిపోగా ఆకాశగమన శక్తి పోయెను. ఆతడు నిత్యాగ్నిహోత్రుడు కాన అగ్నిని స్తుతించెను. ఆ యగ్ని అతనిని ఇంటికి చేర్చెను. ఇది ఆంధ్ర కవితా పితామహుడు అల్లసాని పెద్దన కవి భావన. ఇది ఎంత గొప్పది.

అగ్నీంద్రాదులను దేవతలుగా దర్శించిన మహర్షులచే అగ్నీంద్రాదులను గూర్చిన విషయములు చెప్పఁబడినవి.

## అగ్ని

అగ్నికి జాతవేదుఁడు వైశ్వానరుడు అను పేర్లు గలవు అగ్ని భూమి యందుండును. అగ్ని యాకారము పురుషునివలెను తద్భిన్నమువలెను ఉండును. అగ్నికి ద్యులోకముతోను, ప్రాతస్సవన త్రివృత్స్తోమరథంతర సామలతోను గాయత్రితోను భక్తివలన సాహచర్యము గలదు. అగ్నికి అగ్నాయి, పృథివి, ఇల అను భార్యలు గలరు. అగ్ని దేవతలకు హవిస్సిచ్చుచు, దేవతలను బిలుచుచు, ప్రకాశమిచ్చుచునుండును. అగ్నిని ఇంద్రవరుణ సోమపర్జన్యులు స్తుతించు దేవతలు. అగ్నికి శరత్తు, అనుష్టుప్పు, ఏకవింశ స్తోమము వైరాజము అను ఆయతనములు గలవు.

## వాయువు, ఇంద్రుఁడు

వాయువు, ఇంద్రుఁడును, అంతరిక్షమున అనఁగా భూమికి ఆకాశమునకు (ఆకాశము అనఁగా మేఘమండలము ప్రాణవాయువు గల భాగము.) మధ్యభాగమున నుందురు. అంతరిక్షలోక, మాధ్యందిన సవన, గ్రీష్మ త్రివృత్స్తోమ, త్రిష్టుప్పు పంచదశ స్తోమములతో భక్తి సాహచర్యము గలదు. అదితి మొదలగువారు భార్యలు. రసము (జలము) నిచ్చుచు వృత్రవధ (మేఘమండల భేదము) చేయుచు బలమిచ్చుచు నుందురు. వాయువును ఇంద్రుని అగ్నిసోమ వరుణ పూష బృహస్పతి పర్వత కుత్స విష్ణులు స్తుతింతురు. హేమంత, పంక్తి ఛందస్సు, త్రిణవసవన శాక్వర సామములు ఆయతనములు. శిశిరము అతిఛందస్సు త్రయస్త్రింశత్స్తోమ దైవతసోమద్యు భక్తులు గలవు.

## సూర్యుఁడు

సూర్యుఁడు మేఘమండలముపైని దివమున నుండును. ఇహలోక తృతీయసవన వర్షజగతీ, సప్తదస్తోమ వైరాజములతో సూర్యునికి భక్తి సాహచర్యము గలదు. రసమును (జలమును) తీసికొనుట దానిని ధరించుట సూర్యుని పని. సూర్యుని చంద్ర వాయు సంవత్సర దేవతలు స్తుతింతురు. శిశిరము అతిఛందస్సు, త్రియస్త్రింశస్తోమము దైవతసామము ఆయతనములు.

ఈ విధముగా అగ్న్యాదులను మహర్షులు దర్శించినట్లు యాస్కమహాముని నిరుక్తములో వివరించి యుదాహరణములు చూపెను.

ఈ యింద్రాదుల నుద్దేశించిచేయు యజ్ఞములు హింసాపరములు కావు. అసలు అధ్వర పదమునకు హింస లేనిది. ధ్వరము=హింస అది లేనిది అధ్వరము అని సాయణాదులు చెప్పిరి. "మాహింస్యాత్ సర్వా భూతాని" అన్ని భూతములను హింసింపరాదు. అనియు వేదములు ఉద్ఘోషించుచున్నవి. మనుష్యులు పరమేశ్వరుని కర్పించు నైవేద్యాదులు, వారివారికి దొరకు నాహారములను బట్టియు. వారివారికిష్టమైన వానిని బట్టియు కొన్ని హింసామయ యజ్ఞములు పూర్వము జరగెడివందురు. మఱియు యజ్ఞములలోఁ జేయు హింస హింస కాదనియు నందురు. అశ్వమేధాది యాగములను రాజులు చేయువారు. వారు మాంసాహారులు గనుక వారట్లు చేయుట తటస్థించినది. యదన్నః పురుషస్తదన్నాస్తస్య దేవతాః (రామాయణము) ఋత్విక్కులు, బ్రాహ్మణులు గదా వారట్లు చేయించిరని విమర్శగూడ గలదు. ఆలంభమను పదమునకు హింస యర్థము చెప్పుదురు. కాని ఆలంభపదమునకు 'పొందుట' అని యర్థమును సాయణాచార్యులుగూడఁ జెప్పిరి.

ఈ యజ్ఞాదులెట్లు చేయవలయును? వాని ఫలితములను విషయములను గూర్చి ఆపస్తంబాది శ్రౌత సూత్రములలో వివరించఁబడినది. ఏ మంత్రమును ఉచ్చరించి యే కర్మ చేయవలయునో అందు వివరించఁబడినవి. పుత్రకాములు వర్షాదికాములు ఏ యజ్ఞములు చేయవలయునో ఆ విషయములు బ్రాహ్మణ గ్రంథములందును జెప్పఁబడినది.

ఆహుతులవల్ల వర్షాదులు కలుగును.

అగ్నౌ ప్రాస్తాహుతిః సమ్యగాధిత్య ముపతిష్ఠతే
అదిత్యా జ్జాయతే వృష్టి వృష్టేరన్నంతతః ప్రజాః

అగ్నియందు ప్రేల్చఁబడిన యాజ్యాహుతి సరిగా సూర్యునిఁ జేరును. ఆ సూర్యునినుండి వర్షము వచ్చును. ఆ వర్షమువలన అన్నము (ఆహారము) పుట్టును. దాని తరువాత ప్రజలు అనఁగాఁ బ్రాణులు పుట్టునని మనుస్మృతి చెప్పుచున్నది. ఈ విషయమునే భగవద్గీత యిట్లు చెప్పుచున్నది.

"అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్న సంభవః
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః (భగ. 3–14)

అన్నమువలన ప్రాణులు పుట్టుచున్నవి. మేఘమువల్ల అన్నము కలుగును. యజ్ఞమువల్ల మేఘము పుట్టును. యజ్ఞము కర్మవలనఁ బుట్టును.

ఏవం ప్రవర్తితం చక్రం నాను వర్తయతే హయః
అఘాయురింద్రియారామో మోఘం పార్థ సజీవతి (భగ. 3–16)

ఇట్లు ప్రవర్తించిన చక్రమును ఎవఁడు త్రిప్పఁడో వాడు పాపయుక్తమైన యాయువు గలవాఁడై ఇంద్రియ సుఖములందు నిమగ్నుఁడై వాఁడు వ్యర్థముగా జీవించును. అని స్మృతి భగవద్గీతలు యజ్ఞములు అవశ్యాచరణీయములుగాఁ జెప్పుచున్నది. ఇట్లు స్మృతులు ఘోషించిన ప్రకారముచేయక పోవుటచే అనావృష్ట్యతి వృష్టులు కలుగుచున్నవని మనము గ్రహింపవలయును. దిలీపుఁడు వసిష్ఠునితో నిట్లు అనును.

హవి రావర్జితం హోత స్త్వయా విధి వదగ్నిషు
వృష్టి ర్భవతి సస్యానా మవగ్రహ విశోషిణాం (రఘు. 1–62)

ఓ హోతా! విధి యుక్తముగా అగ్నులందు హోమము చేయఁబడిన హవిస్సే యనావృష్టిచే నింకిన సస్యములకు వర్షమగుచున్నది" అని కాళిదాసు వర్ణించెను.

తవ మంత్రకృతో మంత్రై ర్దూ రాత్ప్ర శమితారిభిః
ప్రత్యాదింశ్యంత ఇవమే దృష్టలక్ష్య భిదః శరాః (రఘు. 1–61)

"మంత్రద్రష్టలైన నీయొక్క పరోక్షములో నున్న శత్రువులను శాంతపఱచు–మంత్రములచే–ప్రత్యక్షముగానున్న లక్ష్యమును భేదించు నాశరములు నిరాకరింపఁబడుచున్నవిపలె నున్నవి" అని కాళిదాసు మంత్ర ప్రభావమును సత్యముగా వర్ణించెను.

దుదోహ గాంస యజ్ఞాయ సస్యాయ మఘవాదివం
సంపద్వినిమయే నోభౌద దధతుర్భువన ద్వయం (రఘు. 1–26)

యజ్ఞమునకై దిలీపుఁడు భూమియనెడు గోవు పిదికెను. ఇంద్రుడు సస్యములకై దివమనెడి గోవును పిదికెను. తమకున్న సంపదలను మార్చుకొనుచు ఇద్దఱు రెండు లోకములను (భూమి స్వర్గ లోకములను) ధరించిరి.

## ఋగ్వేదాదులకు శాఖాదులు
### (శౌనకునిచేఁ జరణవ్యూహములోఁ జెప్పఁబడినవి)

| వేదము | శాఖలు | బ్రాహ్మణములు | ఆరణ్యకములు | ఉపనిషత్తులు |
|---|---|---|---|---|
| ఋగ్వేదము | 1 శాకల<br>2 బాష్కల<br>3 ఆశ్వలాయన<br>4 సాంఖ్యాయన<br>5 మాండూకాయన<br>6 శాఖలు లోపించెను | 1 ఐతరేయ<br>2 శాంఖ్యాయన (కౌషీతకి)<br>3 పైంగిరాహస్యము<br>4 సాత్యాయనము | ఐతరేయారణ్యకము<br>కౌషీతకి ఆరణ్యకము | ఐతరేయోపనిషత్తు<br>2 కౌషీతకి ఉపనిషత్తు |
| శుక్ల యజుర్వేద సంహిత లేక వాజసనేయ సంహిత (సూర్యుడు వాజి అయి చెప్పినది.) | మాధ్యందిన శాఖ<br>కణ్వశాఖ<br>కపిష్ఠల శాఖ | శతపథ బ్రాహ్మణము | బృహదారణ్యకము | ఈశావాస్యోవ నిపత్తు<br>బృహదారణ్యకోపనిషత్తు |
| కృష్ణ యజుర్వేదము లేక తైత్తిరీయ సంహిత | తైత్తిరీయ శాఖ<br>మైత్రాయణీ శాఖ<br>కఠశాఖ | 1 వల్లభి 2 సత్యాయన 3 మైత్రా<br>కృష్ణయజుర్వేద బ్రాహ్మణము= | తైత్తిరీయారణ్యము | తైత్తిరీయోపనిషత్తు<br>2 మైత్రాయణీయోపనిషత్తు<br>కఠోపనిషత్తు |
| సామవేదము= కౌథుమ సంహిత | కౌథుమశాఖ<br>రాణాయనీయ<br>జైమిని | తలవకార<br>తాండ్య,<br>షడ్వింశ<br>సామవిధాన | ఛాందోగ్యారణ్యము<br>జైమినీయారణ్యక | కేనోపనిషత్తు<br>ఛాందోగ్యోపనిషత్తు<br>జైమినీయోపనిషత్తు |
| అథర్వ వేదము శౌనకీ శాఖ | పిప్పలాద శాఖ | గోపథ బ్రాహ్మణము | | ముండకోపనిషత్తు<br>మాండూక్యము ప్రశ్న |

## కల్పసూత్ర గ్రంథాలు

| సూత్ర గ్రంథం | ప్రాచీన విభాగము | నవీన విభాగము | మంత్ర ద్రష్ట లగు ఋషులు | దేవతలు |
|---|---|---|---|---|
| | అష్టకములు 8 | మండలములు 10 | గృత్సమద, | ఇంద్ర సూర్య |
| ఆశ్వలాయన | అధ్యాయ | అనువాక | విశ్వామిత్ర | మరుత్తులు |
| శ్రౌత సూత్ర | ములు 64 | ములు 85 | వామదేవ అత్రి | వరుణ విష్ణు |
| | వర్గములు | సూక్తములు | భరద్వాజ | అదితి పూష |
| | 100 పైగా | 1018 | వసిష్ఠాదులు | అశ్వినీ కుమార |
| | ఋగ్వేద మంత్రములు | | | రుద్ర పర్జన్య |
| | | 105859 | | |
| ఆపస్తంబ | | పదములు | | మిత్ర |
| బౌధాయన | | 153826 | | సవితృ |
| హిరణ్యకేశి | | అక్షరములు | | వివస్వ మొ. |
| భారద్వాజ | | 432000 | | |
| మానవ | | | | |

సామవేదములోని పూర్వార్చికములు అగ్న్యాదిపర్వము తై దున్నవి. ఉత్తరార్చికములు దశరాత్ర, సంవత్సరసత్ర ప్రాయశ్చిత్త క్షుద్రాద్యనుష్ఠానములున్నవి. సంగీతమునకీ వేదము మూలము.

సామవేదములో

కౌథుమ సంహితకు మశక కల్పసూత్రము, లాట్యాయన శ్రౌత సూత్రము, రాణాయణీయ సంహితకు ద్రాహ్యాయణ శ్రౌతసూత్రమును గలవు.
అథర్వవేదమునకు వైతాయన కల్పసూత్రము గలదు.

## హోత, అధ్వర్యు, ఉద్గాత, బ్రహ్మల కృత్యములు

ఋక్కులచే (ఋగ్వేదముచే) స్తుతించుచు దేవతలను ఆహ్వానించువాఁడు హోత. యజ్ఞములలో యజుస్సులచే (యజుర్వేదముచే) దేవతలను పూజించుచు యజ్ఞము చేయించువాఁడు అధ్వర్యువు. యజ్ఞములో సామగానముచే (సామవేదముచే) మంత్రములను జదువువాఁడు ఉద్గాత. యజ్ఞకార్యములను జూచువాఁడు బ్రహ్మ. ఇతఁడు అధర్వవేద మంత్రములచే చేయును.

## ఋగ్వేదములోని విషయ విభాగము

ప్రతివేదము సంహిత–బ్రాహ్మణము–ఆరణ్యకము–ఉపనిషత్తులు అని నాలుగు విధములుగా వ్యాసభగవానునిచే విభజింపఁబడినదని యిదివఱకుఁ జెప్పియుంటిమి.

వేదములోని భాగమె బ్రాహ్మణము విధి బోధకము. "మంత్రబ్రాహ్మణయోర్వేద నామధేయం" (ఆప. శ్రౌ. సూ. 24-1-31)

మంత్రములకు అనఁగా సంహితకు బ్రాహ్మణములకు వేదమని పేరు అని ఆపస్తంబుఁడనెను. "మంత్రబ్రాహ్మణం వేదమిత్యాక్షతే" (బౌ. గృ. 2-6-3) మంత్రములు బ్రాహ్మణములు వేదమందురు అని "బ్రాహ్మణం బ్రహ్మసంఘాతే వేదభాగే నపుం నకం." (మే. కో.)

విధి మంత్రయో రేకార్థ్యమైక శబ్ద్యాత్. (పూ. మీ. 2-1-30) ఒకే శబ్దముచే బోధింపఁబడుటవలన విధి (బ్రాహ్మణ) మంత్రములకొకే యర్థము అని జైమిని. "మంత్రాశ్చ బ్రాహ్మణం చ వేదః" (పూ. మీ. 1-2-33) మంత్రములును బ్రాహ్మణమును వేదమె అని శబరస్వామి.

ఈ విధముగా సంప్రదాయజ్ఞులందఱు మంత్రములను, బ్రాహ్మణములనుగూడ వేదమనియె వ్యవహరించిరి. దయానంద సరస్వతియు వీరి యనుయాయులును దీనిని అంగీకరింపలేదు. బ్రాహ్మణములలో యజ్ఞయాగాది విషయములు వర్ణాశ్రమాది వ్యవస్థయును చెప్పఁబడి యుండుటచేతను అది వారికిష్టము లేకపోవుటచేతను వారంగీకరింపక యజ్ఞయాగాది బోధక భాగమునకు ఇతరమైన యర్థములు చెప్పుట సంభవించినది.

## ఋగ్వేదములోని విషయాదులు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1వ | మండలములో అనేక ఋషులు దర్శించిన మంత్రములు గలవు. | | | | 1976 |
| 2 | ” | గృత్సమదుడు వారి కుటుంబమువి | | | 429 |
| 3 | ” | విశ్వామిత్రుడు | ” | | 617 |
| 4 | ” | వామదేవుడు | ” | ” | 586 |
| 5 | ” | అత్రి | ” | ” | 727 |
| 6 | ” | భరద్వాజుడు | ” | ” | 765 |
| 7 | ” | వసిష్ఠుడు | ” | ” | 841 |
| 8 | ” | కణ్వుడు | ” | ” | 1726 |
| 9 | ” | అనేక ఋషులు | ” | ” | 1754 |

మొత్తము సూక్తములు 10 8 మంత్రములు 10586 గలవు. 2.0 సూక్తములలో ఇంద్రుడు 200 సూక్తములలో అగ్ని 100 పైగా సోముడు స్తుతింపబడిరి.

## కృష్ణ యజుర్వేదములోని విషయాదులు

దర్శపూర్ణ మాసాశ్వమేధ వాజపేయ యాగాదివిషయములు విధివరములు

సామవేదములో

1549 మంత్రములు గలవు. సోమయాగ సంబంధమైనవి. ఋగ్వేదములోనివె చాలవరకు రాగయుక్తముగా గానము చేయబడినవి. 75 మాత్రము క్రొత్తవి.

అథర్వ వేదములో

రక్షః పిశాచాదులను పోగొట్టునవి గలవు. స్తంభన మారణాభిచారికాదులు అనేక విషయములు గలవు. 13వ భాగము వివాహ మంత్రములు ఇవి చాలవరకు ఋగ్వేదములోనివె. 15వ భాగము వేదాంత విషయము. 16, 17 భాగములు శపథ ప్రాయములు. 18వ భాగము ఋగ్వేదములోనివి అవరకర్మ బోధకములు. 19, 20 భాగములు ఇంద్రస్తోత్ర వరములు. చాలవరకు ఛందఃపరములు, కొంత ఋగ్వేద భాగము గలదు.

వేదానుక్రమణికలలో ఋగ్వేదాదులలోనున్న విషయముల సూచికలు కలవు.

ఋగ్వేద బ్రాహ్మణ విషయములు

ఐతరేయ బ్రాహ్మణములు ఎనిమిది పంచికలు, 40 అధ్యాయములు 285 ఖండములు గలవు. ఆరు పంచికలలో సోమయాగము నిరూపింపఁ బడినది. మిగిలిన రెండు పంచికలలో రాజ్యాభిషేక కథనము గలదు.

యజుర్వేద సంహితలోని విషయములు దర్శపూర్ణమాస తత్కామ్యేష్టులు 2 సోమయాగము 4 వైశ్వదేవము 5 అగ్ని చయనము 6 రాజసూయము 7 అశ్వమేధము 8 చాతుర్మాస్యాతి రాత్రాది యాగవిషయములు.

యజుర్వేద బ్రాహ్మణ విషయములు

మాధ్యందినశాఖ శతపథబ్రాహ్మణములో 14 కాండములు 100 అధ్యాయములు 68 ప్రపాఠకములు 438 బ్రాహ్మణములు 7624 ఖండికలు గలవు.

1వ కాండలో దర్శపూర్ణమాస యాగము

2వ కాండలో అగ్నిహోత్రము, పిండ పితృయజ్ఞము దాక్షాయణ యజ్ఞము, నవాన్నేష్టి చాతుర్మాస్యలు.

3, 4 కాండలలో సోమయాగము.

5వ కాండలో వాజపేయ రాజసూయ యాగములు

6, 7, 8, 9, 10 కాండలలో చయనము

11వ కాండలో పశు బంధము, పంచమహా యజ్ఞములు మిత్రవిందేష్టి, దర్శపూర్ణమాసాది శేషమును

12వ కాండలో ద్వాదశాహ సత్రము, సంవత్సర సత్రము, సౌత్రామణీ.

13వ కాండలో అశ్వమేధము, పురుషమేధము, సర్వమేధము, పితృమేధము.

14వ కాండలో ప్రవర్గ్యము, బృహదారణ్యకమును, కణ్వశాఖ శతపథబ్రాహ్మణములు 17 కాండములు 104 అధ్యాయములు 435 బ్రాహ్మణములు 6806 ఖండికలును గలవు.

1వ కాండలో అగ్నిహోత్రము, పిండపితృయజ్ఞ దాక్షాయణీయము చాతుర్మాస్యలు.

2వ కాండలో దర్శపూర్ణ మాసేష్టి

3వ కాండలో అగ్నిహోత్రార్థ వాదము, దర్శపూర్ణ మాసార్థవాదము.
4వ కాండలో సోమయాగము
5వ కాండలో సోమయాగ శేషము
6వ కాండలో వాజపేయము
7వ కాండలో రాజసూయము
8వ కాండలో ఉఖా సంభరణము
9, 10, 11, 12 లలో చయనము
13వ కాండలో ఆధాన కాలము, పధికృత్తు, శంయువాకము, పత్నీ సంయాజములు, పశుబంధము.
14వ కాండలో సౌత్రామణీ
15వ కాండలో అశ్వమేధము
16వ కాండలో ప్రవర్గ్యము
17వ కాండలో బృహదారణ్యకము

తైత్తిరీయారణ్యకములో 3 అష్టకములు (కాండలు) 28 ప్రపాఠకములు 35 అనువాకములు గలవు.

సామవేదములో

1 తాండ్యబ్రాహ్మణములో 25 ప్రపాఠకములు, 347 ఖండములున్నవి. సాయణాచార్యులు ప్రపాఠకమును అధ్యాయమనెను. ఇందు అగ్నిష్టోమ సంస్థగల జ్యోతిష్టోమము మొదలుకొని వేయి వత్సరములకొఱకు గల సోమ యాగములన్నియుఁ జెప్పఁబడెను.

2 షడ్వింశ బ్రాహ్మణములో 5 ప్రపాఠకములు 48 ఖండములు గలవు.
3 మంత్ర బ్రాహ్మణములు 2 ప్రపాఠకములు 16 ఖండములు
4 దైవత బ్రాహ్మణము 3 ఖండములు 62 కండికలు. ఇందులో ఛందస్సుల వర్ణన గలదు.
5 ఆర్షేయ బ్రాహ్మణములో 3 ప్రపాఠకములు 82 కండికలు ఇందులో సామల ఆర్షానుక్రమణీ
6 సామవిధాన బ్రాహ్మణములో 3 ప్రపాఠకలు 25 ఖండికలు ఇందు అభిచారాది కర్మల వర్ణన.

7 సంహితోపనిషద్బ్రాహ్మణములో 1 ప్రపాఠకము 5 ఖండములు
8 వంశ బ్రాహ్మణములో 3 ఖండములు ఇందు సామవేదాచార్యుల వంశ పరంపర
9 జైమినీయ బ్రాహ్మణములో 1182 ఖండములు. తలవకార బ్రాహ్మణమని దానికి నామాంతరము గలదు.
10 జైమినీయార్షీయ బ్రాహ్మణములో 84 ఖండములు.

అథర్వ వేదములో

అథర్వ వేదములో మోహన, మారణ ఉచ్చాటనాభి చారికాదులు వివాహాది క్రియలు మంత్రములు గలవు. 20 కాండలు 34 ప్రపాఠకలు 1116 అనువాకాలు 731 సూక్తములు 5846 మంత్రాలు గలవు. ఇందులో 1200 ఋగ్వేదములోనివే.

గోపథ బ్రాహ్మణము 1 పూర్వభాగము 2 ఉత్తర భాగము
పూర్వ భాగములు 5 ప్రపాఠకులు

ఈ గ్రంథములలో పేరుకు లభించు బ్రాహ్మణములు
1 చరక బ్రాహ్మణము 2 శ్వేతాశ్వర బ్రాహ్మణము 3 కారక బ్రాహ్మణము 4 మైత్రాయణీయ బ్రాహ్మణము 5 జాబాల బ్రాహ్మణము 6 ఖాండికేయ బ్రాహ్మణము 7 ఔఖేయ బ్రాహ్మణము 8 హారిద్రవిక బ్రాహ్మణము 9 ఆహ్వరక బ్రాహ్మణము 10 కంకతి బ్రాహ్మణము 11 గాలవ బ్రాహ్మణము 12 తుంబు బ్రాహ్మణము 13 ఆరుణేయ బ్రాహ్మణము 14 పైంగాయని బ్రాహ్మణము 15 సౌలభ బ్రాహ్మణము 16 శైలాలి బ్రాహ్మణము 17 పరాశర బ్రాహ్మణము 18 మాషశరావి బ్రాహ్మణము 19 కాపేయ బ్రాహ్మణము 20 అన్వాఖ్యాన బ్రాహ్మణము 21 భాల్లవి బ్రాహ్మణము 22 శాట్యాయన బ్రాహ్మణము 23 కాలబవి బ్రాహ్మణము 24 కారూకి బ్రాహ్మణము.

వీనిపేర్లే గాని ఇవి లభించుట లేదు.

ఈ వేదములను గూర్చి తెనుగు భాగవతమిట్లు చెప్పుచున్నది. (భాగ 12–32)

బ్రహ్మ తన వదన చతుష్టయంబువలన వేద చతుష్టయంబు కలుగఁజేసె నంత నతని పుత్రులగు బ్రహ్మవాదులా వేదంబు లం దుపదిష్ట ప్రకారంబుగా

నభ్యసించి యాక్రమంబున వారలు తమ శిష్య పరంపరలకు నుపదేశించి రిట్లు వేదంబులు సమగ్రింబులుగాఁ బ్రతి యుగంబున మహర్షులచే నభ్యసింపఁ బడియెనట్టి వేదంబుల సమగ్రింబుగఁబఠియింప నశక్తులగు వారలకు సహాయంబు చేయుటకై ద్వాపర యుగాదియందు భగవంతుడు సత్యవతీదేవి యందుఁ బరాశరమహర్షికి సుతుండై యవతరించి యావేదరాశింగ్రమమ్మున ఋగ్యజుస్సామాథర్వంబులన నాలుగు విధంబులుగ విభజించి పైల వైశంపాయన, జైమిని, సుమంతులనియెడి శిష్యవరులకుఁ గ్రమంబున నావేదంబుల నుపదేశించెనందుఁ బైలమహర్షి చేకొన్న ఋగ్వేదంబనంతంబులగు ఋక్కులతోఁ జేరి యుండుటంజేసి బహ్వృచశాఖయని చెప్పంబడునంత నా పైలుఁ డిందుప్రమితికి బాష్కలునకు నుపదేశించె తన బాష్కలుండు సంహితం జతుర్విధంబులు గావించి శిష్యులగు బోధ్యుండు యాజ్ఞవల్క్యుండుఁ బరాశరుండు నగ్నిమిత్రుండు ననువారికి నుపదేశించె నింద్ర ప్రమితి తన సంహిత మాండూకేయుండు దేవమిత్రుండను వానికింజెప్పి నతనికి సౌభర్యాదిశిష్యులనేకులై ప్రవర్తిల్లి రంత సౌభరిసుతుండు శాకల్యుండు తానభ్యసించిన శాఖలైదు విధంబులుగ విభజించి వాత్స్యుండు మౌద్గల్యుండు శాలీయుఁడు గోముఖుండు శిశిరుండు అనెడు శిష్యులకుపదేశించె నంత జాతుకర్ణియను వానికి వారుపదేశింప నతండు బలాకుండు పైంగుండు వైతాళుఁడు విరజుండును వారి కుపదేశించె నదియునుంగాక మున్ను వినిపించిన బాష్కలుని కుమారుండైన బాష్కలి వాలఖిల్యాఖ్య సంహితను బాలాయని గార్గ్యుండు, కాసారుండను వారలకుఁ జెప్పెని ట్లెఱుంగున బహ్వృచ సంహితలనేక ప్రకారంబులంబూర్వోక్త బ్రహ్మర్షులచే ధరియింపఁబడె యజుర్వేద ధరుండగు వైశంపాయనుని శిష్య సంఘంబు నఖిల క్రతువుల నాధ్వర్య కృత్యంబుచేఁ దేజరిల్లిరి. మఱియు నతని శిష్యుఁడగు యాజ్ఞవల్క్యుండు గుర్వపరాధంబు చేసిన నా గురువు కుపితుండై యధీతవేదంబుల మరలందనకిచ్చి పొమ్మనిన నతండు దాను జదివిన యజుర్గణంబును తత్తదుక్తక్రమంబునఁ గ్రక్క నవి రుధిరాక్తంబగు రూపంబుఁ దాల్చిన యజుర్గణాధిష్ఠిత దేవతలు తిత్తిరిపక్షులై వానిని భుజియించిరి. దానంజేసి యా శాఖలు తైత్తిరీయంబులయ్యెనంత నిర్వేదియగు నా యాజ్ఞ వల్క్యుండు అపరిమిత నిర్వేదంబునొంది యుగ్ర తపంబున సూర్యుని సంతుష్టునింగావింప నతండు సంతసిల్లి హయరూపంబు దాల్చి

యజుర్గణంబునతని కుపదేశించెఁ గావున నది వాజసనేయ శాఖయని వాక్రుచ్చఁబడెనంత నా యజుర్గణంబు కాణ్వమాధ్యంది నామములచే నభ్యసింపఁబడి నిట్లు యజుర్వేదంబు లోకమునఁ బ్రవర్తిల్లె. సామవేదాధ్యేతయగు జైమిని మహర్షి తన సుతుండగు సుమంతునికి నుపదేశించెనతండు సుకర్ముండను తన తనయునకుఁ దెలిపె నతఁడా వేదమును సహస్రశాఖలుగా విభజించి కోసలుని కుమారుండగు హిరణ్య నాభునికిని దన కుమారుండగు పౌష్పంజి యనువానికి నుపదేశించెనంత వారిరువురు బ్రహ్మవేత్తలగు నావంత్యులు నుదీచ్యులు ననునేనూర్గురికి నుపదేశించి వారిని సామవేదపారగులం గావించిరిట్లు సామవేదంబు లోకంబున వినుతిచెందె. మఱియు నథర్వవేత్తయగు సుమంత మహర్షి దానిం దనశిష్యునకుపదేశింప నతండు వేదధర్ముండు పథ్యుండు అను శిష్యులకుపదేశించె నందు వేదధర్ముండనువాఁడు శౌల్కాయని, బ్రహ్మబలి, నిర్దోషుండు పిప్పలాయనుండు అను వారలకును, బభ్యుండనువాఁడు కుముదుండు, శునకుండు జాబాలి బభ్రువు అంగిరసుఁడు సైంధవాయనుండను వారలకు నుపదేశించి ప్రకాశంబు నొందించె నిత్తెఱంగున నథర్వ వేదంబు వృద్ధినొందె.

ఇతిహాస పురాణాభ్యాం వేదార్థ ముపబృంహయేత్

బిభేత్యల్ప శ్రుతాద్వేద మామయం ప్రహరేదితి

(సాయన ఋగ్వేదపీఠిక)

ఇతిహాస పురాణములచేత వేదమును వివరింప వలె "నన్ను వీఁడు ప్రహరించు" నని అల్పజ్ఞుని నుండి వేదము భయపడు చున్నది. అను సూక్తి గలదు. ఇతిహాసాములలో వివరించి చెప్పఁబడిన కథలను సూచించు భాగములు వేదములలోఁగనుపట్టుచున్నవి. వానిని సామాన్యులకుఁదెలుపుటకై పురాణములు ప్రవర్తిల్లించినవి మంత్రద్రష్టలగు మహర్షులు సర్వమును అధి భౌతికాధ్యాత్మికాధి దైవిక రూపత్రివిధ దృష్టులతోఁదిలకించిరి. వేదములు శ్రుతులు అవి మహర్షులకు ధ్యానావస్థలో శ్రుతములైనవి అనఁగా వినఁబడినవి గాన శ్రుతులయినవి. శ్రుతములైన శ్రుతులననుసరించి స్మరించుటవల్ల స్మృతులయినవి, అస్మృతులె పురాణములు ధర్మశాస్త్రములు. వేదములనుండి

కేవలము ధర్మములను యజ్ఞయాగాది క్రతువులనే గాక అందు సూచింపబడిన కథలను ఆధారముగాఁ జేసికొని వాల్మీకి వ్యాసులు పురాణకథలను రచించిరి. వేదార్థోప బృంహణముగా రామాయణమును వ్రాసినట్లు వాల్మీకి చెప్పెను.

### వామనావతార కథ

ఇదం విష్ణు ర్విచక్రమే త్రేథా నిదధే పదం
సమూహళ్హ మస్య పాంసురే (ఋ. 1-2-7-17)

ఈ విశ్వమును వ్యాపించి విష్ణువు మూడు విధములుగా తన పదమును ఉంచెను (విక్రమించెను.) ధూళిధూసరిత ప్రదేశమందు ఈ విష్ణువు యొక్క పదము స్థిరముగా నుండెను.

త్రీణి ప్రదా విచక్రమే విష్ణు ర్గోపా అదాభ్యః
అతోధర్మాణి ధారయన్ (ఋ- -2-7-18)

విష్ణువు మూఁడు అడుగులు విక్రమించెను. రక్షకుఁడు కనుకధర్మములను ధరించుచుండెను.

"ఈ విధముగా విష్ణువు మూఁడు అడుగులు సమస్త లోకములందుంచి (విక్రమించి) రక్షకుఁడై ధర్మములను ధరించెను" అని ఋగ్వేదములో సూచన ప్రాయముగా చెప్పబడిన దానిని గ్రహించి వామనావతార కథను వ్యాసమహర్షి రచించెను.

"క్షితిం పదై కేన బలేర్విచక్రమే
నభః శరీరేణ దిశశ్చ బాహుభిః
పదం ద్వితీయం క్రమత స్త్రివిష్టపం
నవై తృతీయాయ తదీయ మణ్వపి. (భాగ 8, 21. 33)

విష్ణువు ఒక యడుగుతో బలిచక్రవర్తి భూమిని, శరీరముచేత ఆకాశమును బాహువులచేత దిక్కులను వ్యాపింపగా ఇట్లు క్రమముగా త్రిలోకమును రెండవ పదమైనది. మూఁడవ యడుగునకుఁ గొంచెముగూడ చోటు లభింపలేదు. ఈ విధముగా భాగవతములో వామనావతార కథకు ఋగ్వేదములోని కాణ్వుఁడగు మేధాతిథిచే దృష్టమగు 2 వ సూక్తములోని 1-6 వ 2వ

ధ్యా 7వ వర్గములోని విషయము అధారమైనది. పరమాత్మ సర్వ వ్యాపకుఁడని ఆధ్యాత్మి కర్థము గ్రహింపవలెను.

శునశ్శేఫకథ

ఆజీగర్తియైన శునశ్శేఫునిచే దర్శింపఁబడిన ఋగ్వేద సూక్తిలో

శతంతే రాజన్ భిషజః సహస్రముర్వీ
గంభీరా సుమతిష్టేఅస్తు
బాధ స్వ దూరే నిఋతిం పరాచైః కృతం
చిదేనః ప్రముముగ్ధ్యస్మత్, (ఋగ్వే. 1-2- 4-9)

ఓ వరుణరాజా! నీకు నూరుగురు వేలు వైద్యులు గలరు. భూమి గంభీర మైనది. నీకు సుమతిగలుగుఁగాక పరాజయములచేత మృత్యువును క్రిందఁబడవేయుము మా పాపములను బోగొట్టుము.

తత్త్వాయామి బ్రహ్మణావందమాన స్తదాశాస్తే
యజమానో హవిర్భిః అహేడమానోవరుణేహ
బోధ్యురు శంసమాన ఆయుః ప్రమోషీః

కనుక నిన్ను ఎక్కువ యాచించు చున్నాను. మంత్రముచే నమస్కరించుచున్నవాఁడనై ప్రార్థించుచున్నాను. యజమానుఁడు హవిస్సులచే అనాదృతిచేయఁడు ఇక్కడ తెలిసి ఓ బృహస్తోత్రా! మా ఆయువు పోగొట్టకు

తిదిన్నక్తం తద్దివా మధ్యమాహు స్తదయం
కేతో హృద ఆవిచేష్టే। శునశ్శేపో
యమహ్వ ద్గృభీతః సో అస్మాన్ రాజవరుణో ముమోక్తు
(ఋగ్వే 1-2-14-12)

ఆ రాత్రే ఆ పగలే ఆవరుణస్తుతిని ఆచార్యులు చెప్పెదరు ఆవరుణస్తుతిలోని ప్రజ్ఞ హృదయమున వెడలును. శునశ్శేపుఁడు (శునః = సుఖమైన, శేప = కాంతిగలవాఁడని వ్యుత్పత్తి) ఏవరుణుని పిలిచెనో ఆవరుణుని బంధములనుండి విముక్తులను జేయునుగాక.

శునశ్శేఫో హ్యహ్వ ద్గృభీ తస్త్రి ష్వాదిత్యం
ద్రుపదేషు బద్ధః। అపైనం రాజా వరుణః

సస్పృత్యాద్విద్వాం అదబ్ధో విముమోక్తు పాశాన్

మూఁడు స్తంభములలో బద్ధుఁడైన శునశ్శేపుని రక్షకై వరుణుఁడు విడిచిపుచ్చుఁగాక. విద్వాంసుఁడు అప్రతి హత శక్తియై పాశములనుండి ముక్తుని జేయుగాక.

ఈ కథే వాల్మీకి రామాయణములో నిట్లు చెప్పఁబడినది. "అంబరీషుఁడను రాజు యజ్ఞము చేయుచుండెను అతని యజ్ఞ పశువును ఇంద్రుఁడు హరించెను. అపుడు విప్రుడు రాజుతో నీవు యజ్ఞపశువును రక్షింపవలసినవాఁడవు రక్షింపవైతివి. నీవు యజ్ఞపశువును తీసికొని రమ్మనెను. అప్పుడే రుచి కుఁడను బీదబ్రాహ్మణుని దగ్గఱకు వెళ్ళి నీవు నీ కొడుకును యజ్ఞపశువుగా విక్రయించినచో నీకు నూఱువేల గోవులిచ్చెదననెను. తండ్రి పెద్దకొడుకు నివ్వననెను, తల్లి చిన్న కొడుకు నివ్వననెను. అపుడు మధ్యవాఁడు శునశ్శేపుడిది తెలిసికొని రాజుతో నేను యజ్ఞపశువుగా వచ్చెదను" మా తండ్రికి గోవులిమ్మని అతనితో వెళ్ళెను. దారిలో మేనమామయగు విశ్వామిత్రుఁడు గనిపింపఁగా తన సంగతి విశ్వామిత్రునితోఁ చెప్పెను. విశ్వామిత్రుడు తన పుత్రులను యజ్ఞపశువుగా వెళ్ళమనఁగా వారు నిరాకరింపగా వారిని "మీరు శవ మాంస భోజనులై తిరుగుఁడు" అని విశ్వామిత్రుఁడు శపించి రెండు మంత్రములను శునశ్శేపునికిఁ జెప్పి జపింపమనెను. అట్లు శునశ్శేపుడు జపింపఁగా ఇంద్రుఁడు ఇంద్రుని తమ్ముఁడును సంతోషించి రాజునకు యజ్ఞఫలమును శునశ్శేపునికి దీర్ఘాయువును ఇచ్చిరి" అని. (రామా. బాల. 62 సర్గ.) ఇదే గాకుండ అజీగర్తుడు తన కొడుకు శునశ్శేపుని హరిశ్చంద్రుని కమ్మినట్లు ఆ శునశ్శేపుఁడు బ్రహ్మను మంత్రములతో స్తుతింపఁగా బ్రహ్మవచ్చి శునశ్శేపుని బంధముక్తుని గావించినట్లును కథ గలదు. పై కథలకు ఈ ఋగ్వేదములోని పై మంత్రములే ఆధారము. ఇది ఆధి భౌతికార్థము.

## ఆధ్యాత్మికార్థము

శునశ్శేపుఁడనఁగా సుఖరశ్మి రూపుఁడైన జీవుఁడు అన్నమయ ప్రాణమయ మనోమయరూప త్రివిధ బంధముక్తులచే బద్ధుఁడై ముక్తికొఱకు వరుణుని (దేవుని) ప్రార్థించి ముక్తుడయ్యెనన్నది యాధ్యాత్మికార్థము.

## వృత్రి కథ

ఇంద్రస్యను వీర్యాణి ప్రవోచం యానిచకార ప్రథమాని వజ్రీ
అహన్నహిమన్వప స్తతర్ద ప్ర వక్షణా అభినత్ పర్వతానాం
(ఋగ్వే. 1-1-36౫6-1)

ఏ ప్రధానములైన వీర్యములను వజ్రియైన యింద్రుఁడు చేసెను. అవి చెప్పెదను. మేఘమును గొట్టెను. పిదప నీటిని భూమిపైఁ బడవైచెను. పర్వతములోఁ బ్రవహించు నదులను విరివిగాఁ జేసెను.

అహన్నహిం పర్వతే శిశ్రియాణం త్వష్టాస్మై వజ్రం స్వర్యంతతక్ష
వాశ్రా ఇవ ధేనవః స్యందమానా అంజః సముద్ర మవజగ్మురాపః
(ఋ. గ్వే. 112-3౮-2)

పర్వమును ఆశ్రయించిన మేఘమును ఇంద్రుఁడు హింసించెనో త్వష్ట వీనికై దివ్య వజ్రమును సానపట్టెను. ప్రవహించు నీళ్ళు సముద్రమును ఋజుమార్గముగా అంబా అని యఱచుచు గోవులవలెఁ జేరినవి.

అహన్ వృత్రం వృత్రతరం వ్యంసమింద్రో వజ్రేణ మహతావధేన
స్కంధాంసీవ కులిశేనా వివృక్ణాహి శయత ఉపపృక్ పృథివ్యాః

ఇంద్రుఁడు వృత్రుని మిగుల నావరించిన మేఘరూప వృత్రాసురుని వజ్రముచే గొప్పదెబ్బతో భుజములు తెగినవానినిగాఁ గొట్టెను. వజ్రముచేఁ దెగఁగొట్టఁబడిన చెట్టు మొదళ్ళవలె వృత్రుఁడు భూమిక్రిందఁ బడెను.

అపాద హస్తో అపృతన్యదింద్రమాస్య వజ్రమధిసానౌ జఘాన్
వృష్ణో వధ్రిః ప్రతిమానంబు భూషన్ పురుత్రా వృత్రో అశయద్వ్యస్తః

కాళ్ళు చేతులు లేనివాడయ్యును వృత్రుఁడు ఇంద్రునితో యుద్ధము చేయగోరిన ఇంద్రుఁడు ఆ వృత్రుని చఱియ వంటి వక్షస్థలమున వజ్రముతో గొట్టెను. పుంస్త్వము లేనివాఁడయ్యు అవృత్రుఁడు పుంస్త్వము గలవానిని ననుకరించెను. కాని యింద్రుఁడు వానిని గొట్టగా విక్షిప్తాంగుడయి భూమిపయిఁ బడెను.

నీ చావయా అభవద్వృత్ర పుత్రేంద్రో అస్యా అవవధర్జభార
ఉత్తరాసూరధర పుత్ర ఆశీద్దానుః శయే సహవత్సావ ధేనుః

వృత్తుని తల్లి క్రింద శాఖలవంటి బాహువులు గలదై యుండెను. ఇంద్రుడు ఈ తల్లిని క్రిందుగా వజ్రముతో గొట్టెను. అపుడా రాక్షసుని తల్లి పైనుండెను. కొడుకు వృత్రుఁడు క్రిందనుండెను. దూడతోఁ గూడిన ఆవువలె కొడుకు వృత్రునితోఁ గూడిన రాక్షసి యుండెను.

అతిష్ఠంతీనా మనివేశ నానాం కాష్ఠానాం మధ్యే నిహితం శరీరం
వృత్రస్యనిణ్యం విచరంత్యాపో దీర్ఘతమ ఆశయదింద్ర శత్రుః

చలించుచు నివాసములేని జలముల మధ్య వృత్రుని శరీరము గూఢమై యుండెను. అక్కడ నీళ్ళు ఆక్రమించి తిరుగుచున్నవి. ఆ యింద్రశత్రువు దీర్ఘనిద్ర పొందెను. ఇట్లే వృత్రునిగూర్చి ఇంకను ఆయా మంత్రములలోఁ గలదు. (ఋగ్వే. 1–2–36–10)

ఇంకను వృత్రానుచరులు ఆక్రమింపగా వారిని ఇంద్రుడు జయించినట్లును గలదు. ఈ పై ఋగ్వేదభాగములో ఆవతించిన మేఘము వృత్రాసురుడుగా పోల్చబడెను. ఇంద్రుడు వర్షాధి దేవత. కాన ఆ మేఘమును ఛిన్నముచేసి ప్రపంచమున నదులుగా విభజించెనని ఆధిదైవికార్థము గలదు. ఇదే కారణమున వృత్రాసురుని ఇంద్రుడు చంపిన కథగా వర్ణింపబడెను. త్వష్ట్ర ప్రజాపతిచే హోమగుండమునుండి పుట్టింపఁబడినట్లు అందుఁ గలదు. ఈ విషయమున నిరుక్తములో ఇట్లు చెప్పబడెను. "వృత్రోమేఘ ఇతి నైరుక్తాః" త్వాష్ట్రోఽసుర ఇతి ఐతిహాసికాః, ద్వయోః సంగ్రామః శ్రూయతే. ద్వయోః కః సమాధిః" ఉచ్యతే అపాం జ్యోతిషశ్చ వైద్యుతస్య మిశ్రీభావః యుద్ధ రూపేణ కల్పన యా యుద్ధవర్ణా భవంతి, నహ్యత్ర యథా భూతం యుద్ధమస్తి నహీంద్రస్య కేచన శత్రవః సంతి,"

వృత్రుడు మేఘమని నిరుక్త విదులు, త్వష్ట కుమారుఁడైన అసురుడని ఐతిహాసికులు, ఇద్దరకు యుద్ధము వినబడుచున్నది. దీనిభావమేమి చెప్పుదుము. నీటికి విద్యుత్సంబంధియగు జోతిస్సునకు మిశ్రభావము ఈ యుద్ధ

ము గాకల్పింప బడినది. ఇక్కడ నిజముగా యుద్ధములేదు. ఇంద్రునికె వరును శత్రువులు లేరు," అని,

ఇంకను ఋగ్వేదములో అయిదవ మండలములో శ్యావాశ్య రాజు రథ వీతి కూతుల కథ వర్ణింపబడినది.

యమీ యముల సంవాద కథ

ఋగ్వేద 10 వ మండలములో యమితన సోదరుడైన యముని వివాహ మాడగోరగా అది తప్పని సంభాషణ సుందరముగా వర్ణింప బడినది. ఇది ఆధ్యాత్మికము. మధ్య స్థానమందున్న యముడు మాధ్యమిక వాక్కును తన్నుండి విభజించుకొన్న దానినిగా చేసికొని అనును. లోకోపకారముకై "నీవె నీ ఆత్మ జ్ఞానమును ప్రకాశమునె ప్రవేశింపుము" అని

సూర్యాసోముల వివాహము

సోమునితో సూర్యకు వివాహమును అశ్వినీ కుమారులు చేయించుటం ఇందులో వివాహ పద్ధతి తెలుపు మంత్రములు గలవు.

ఊర్వశీ పురూరవుల కథ

ఋగ్వేదములో 10 మండలములు 5 మంత్రములో ఊర్వశీ పురూరవుల కథ సంభాషణమును ఉన్నది.

ఊర్వశీ వియోగములో పురూరవుని వేదనలో ఊర్వశిని పురూరవుడు చెట్టు చేమలలో వెదకు కథ ఇది ఐతిహాసికము ఆధ్యాత్మముతో అంత రిక్ష లోకమునకు అధిపత్నియైన ఊర్వశి ఉదక దానముచేయుటకు మేఘముల నుండి మెఱపుగా నయి ఉదకములిచ్చి సస్యాభి వృద్ధికరమగుచున్నది.

వృషాకపి కథ

ఋగ్వేద పదవ మండలములో 86 సూక్తములో వృషాకపి కథ అస్పష్ట ముగా నున్నది.

ఇట్లే ఇంకను కొన్ని కథలు వేదములందు సూచన ప్రాయముగా నున్నవి.

ఇట్లు వేదవిజ్ఞానమును గూర్చి ప్రస్తుతము కొంత సంగ్రహముగ పరి చయము చేయబడినది. ముందు సంపుటములలో విస్తరించి సమగ్రముగ చూపబడును. * * *

# ఋగ్వేద మంత్రములు

## చదువు రీతులు

## ఎనిమిది వికృతులు

ఋక్కులుగాని యజుస్సులుగాని సామలుగాని కలిపి చదువుటను సంహిత యందురు.

### (1) సంహితా పాఠము

ఓషధయః సం వదంతే సోమేన సహరాజ్ఞా
యస్మైకృణోతి బ్రాహణ స్తం రాజన్ పారయామసి

పదచ్ఛేదముచేసిన మంత్రపాఠము

ఓషధయః, సం, వదంతే, సోమేన, సహ, రాజ్ఞా,
యస్మై, కృణోతి, బ్రాహ్మణస్, తం, పారయామసి.

ఇది పదవిభాగముచేసిన సంహితలేని పాఠము.

### (2) పదపాఠము

1 ఓషధయః 2 సం 3 వదంతే 4 సోమేన 5 సహ 6 రాజ్ఞా 7 యస్మై 8 కృణోతి 9 బ్రాహ్మణః 10 తం 11 రాజన్ 12 పారయామసి.

### (3) క్రమపాఠము

క్రమముగా రెండు పదములను పఠించుట. దీనిని యోగరూఢ సంహిత అందురు. క్రమమువల్ల స్మృతికి లాభము కలుగును. 1, 2, 3, మొదలగు అంకెలు మంత్రములోని పదములవరుస సంఖ్యను తెలుపును.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ఓషధయః | సం | సం | వదంతే | సోమేన | సహ | సహ | రాజ్ఞా |
| 1 | 2 | 2 | 3 | 4 | 5 | 5 | 6 |
| రాజ్ఞేతి | రాజ్ఞా | యస్మై | కృణోతి | కృణోతి | బ్రాహ్మణః | బ్రాహ్మణ | |
| 6 | 6 | 7 | 8 | 8 | 9 | 9 | |
| స్తం | తం | రాజన్ | రాజన్ | పారయామసి | పారయామసీతి | పారయామసి | |
| 10 | 10 | 11 | 11 | 12 | 12 | 12 | |

## 4 పంచ సంధులు

అనుక్రమశ్చోత్క్రమశ్చ, వ్యుత్క్రమోఽభిక్రమ స్తథా
సంక్రమశ్చేతి పంచైతే, జటాయాం కథితాః క్రమాః

అనుక్రమము ఉత్క్రమము వ్యుత్క్రమము అభిక్రమము సంక్రమము అని జటలో ఈ యైదుక్రమములు చెప్పఁబడినవి.

క్రమము= 1-2; 2, 3. ఉత్క్రమము 2, 2; 3, 3.
వ్యుత్క్రమము 2, ; 3, 2. అభిక్రమము 1, 1; 2, 2;
సంక్రమము 1, 2; 2, 3.

క్రమము ఉత్క్రమము వ్యుత్క్రమము అభిక్రమము సంక్రమము
1, 2 2, 2 2, 1 1, 1 1, 2

ఓషధయః సం। సం సం। సమోషధయః। ఓషధయః ఓషధయః। ఓషధయః సం।
1 2 2 2 2, 1 1 1 1 2

సం వదంతే। వదంతే వదంతే। వదంతే సం। సం సం। సం వదంతే।
2 3 3 3 3 2 2 2 2 3

వదంతే సోమేన। సోమేన సోమేన। సోమేన వదంతే। వదంతే
3 4 4 4 4 3 3

వదంతే। వదంతే సోమేన। సోమేన సహ। సహ సహ। సహ సోమేన।
3 3 4 4 5 5 5 5 4

సోమేన సోమేన। సోమేన సహ। సహ రాజ్ఞా। రాజ్ఞా రాజ్ఞా। రాజ్ఞా
4 4 4 5 5 6 6 6 6

సహ। సహ సహ। సహ రాజ్ఞా। రాజ్ఞేతి రాజ్ఞా।
5 5 5 5 6 6 6

తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి (ఋ. అ. 3–4–10 సం 30, 62 10, అనుదానికి పంచసంధులు.

తత్సవితుః। సవితుస్సవితుః। సవితు స్తత్। త త్తత్। తత్సవితుః। సవితుర్వరే, ణ్యం। వరేణ్యం వరేణ్యం। వరేణ్యం సవితుః। సవితుః సవితుః। సవితుర్వరే ణ్యం। వరేణ్యం భర్గః। భర్గో భర్గః। భర్గో వరేణ్యం। వరేణ్యం వరేణ్యం। వరేణ్యం

భర్గః। భర్గో దేవస్య। దేవస్య దేవస్య। దేవస్య భర్గః। భర్గో భర్గః। భర్గో దేవస్య దేవస్య ధీమహి। ధీమహి ధీమహి। ధీమహి దేవస్య। దేవస్య దేవస్య। దేవస్య ధీమహి। ధీమహీతి ధీమహి। ఇట్లే ముందును,

## వికృతుల లక్షణములు

తైత్తిరీయే సమామ్నాయే, వ్యాసేనైవ మహర్షిణా
జటాద్యా వికృతీరష్టౌ, లక్ష్యంతే నాతి విస్తరమ్।
జటామాలా శిఖారేఖా, ధ్వజో దండోరథో ఘనః
అష్టౌ వికృతయః ప్రోక్తాః క్రమపూర్వా మహర్షిభిః॥

తైత్తిరీయ సమామ్నాయమందు వ్యాసమహర్షిచేత జట మొదలైన ఎనిమిది వికృతులు అతి విస్తరముగాకుండ లక్షింపబడినవి. జట, మాల, శిఖ, రేఖ, ధ్వజము, దండము, రథము, ఘనము అని ఎనిమిది వికృతులు క్రమపూర్వముగా మహర్షులచేఁ జెప్పఁబడినవి. అందు జటాదండములు ముఖ్యములు. ఈ రెండిటివల్లనే మిగిలిన వికృతులు పుట్టుచున్నవి. అందు జటను శిఖ అనుసరించును. అట్లే దండమును మాల, రేఖ, ధ్వజము, రథము అనుసరించును. జటాదండములను ఘనము అనుసరించును.

## 1 జట

### మొదటి జట లక్షణము

అనులోమ విలోమాభ్యాం త్రివారం హి పఠేత్ క్రమమ్।
విలోమే పదవత్సంధిః, అనులోమే యథాక్రమమ్॥

అనులోమ విలోమములుగా క్రమమును మూఁడుసార్లు పఠింపవలెను. విలోమములో పదమువలె సంధియగును. అనులోమములో క్రమమునను సరించి యుండును.

### రెండవ జట లక్షణము

క్రమే యథోక్తే పదజాతమేవ, ద్విరభ్యసేదుత్తరమేవ పూర్వం
అభ్యస్య పూర్వేచ తథోత్తరే పదేఽవసానమేవంహి జటాభిధీయతే

ఇదివరకుఁ జెప్పబడిన క్రమములో ఉత్తరపదమునే ముందుగా రెండు సార్లు అభ్యసింపవలెను. మొదటిది అభ్యసించి అట్లే ఉత్తర పదమందు అవసానము చేయవలయును. ఇట్లైనచో జట అని చెప్పబడును.

జట= అనులోమము 1-2 కలిపి విలోమము. 2-1 కలిపి అనులోమము.
(క్రమము 1, 2 కలిపి వ్యుత్క్రమము, 2, 1 కలిపి సంక్రమము 1, 2)

జటా పాఠము

ఓషధయస్ సం, సమోషధయ ఓషధయస్ సమ్॥ సం వదంతే,
1 2 2 1 1 1 2 3
వదంతే సం, సం వదంతే॥ వదంతే సోమేన, సోమేన వదంతే
3 2 2 3 3 4 4 3
వదంతే సోమేన॥ సోమేన సహ సహ సోమేన సోమేన సహ॥ సహ
3 4 4 5 5 4 4 5 5
రాజ్ఞా రాజ్ఞా సహ సహ రాజ్ఞా॥ రాజ్ఞేతి రాజ్ఞా॥ యస్మై కృణోతి
6 6 5 5 6 6 6 7 8
కృణోతి యస్మై యస్మై కృణోతి॥ కృణోతి బ్రాహ్మణో బ్రాహ్మణః
8 7 7 8 8 9 9
కృణోతి కృణోతి బ్రాహ్మణః॥ బ్రాహ్మణ స్తం తం బ్రాహ్మణో
8 8 9 9 10 10 9
బ్రాహ్మణ స్తం॥ తం రాజన్ రాజం స్తం తం రాజన్॥ రాజన్॥
9 10 0 11 11 10 10 11 11
పారయామసి పారయామసి రాజన్ రాజన్ పారయామసి॥ పారయామసీతి
12 12 11 11 12 12
పారయామసి॥

## 2 మాల

పుష్పమాల క్రమమాల అని మాల రెండు రకములు

క్రమమాల లక్షణము

బ్రూయాత్ క్రమవిపర్యాసా వర్ధర్చస్యాదితోఽంతతః
అంతంచాదిం నయే దేవం క్రమమాలేతి గీయతే।

పగము ఋక్కుకు మొదట చివర క్రమవిపర్యాసములను చెప్పవలెను. ఇట్లే చివర మొదట నడవవలెను. అపుడు క్రమమాల అని చెప్పబడును.

ఓషధయః సం రాజ్ఞేతి రాజ్ఞా సం వదంతే రాజ్ఞా సహ వదంతే
1 2 6 6 2 3 6 5 3
సోమేన సహ సోమేన
సోమేన సహ। సోమేన వదంతే। సహ రాజ్ఞా। వదంతే సం। రాజ్ఞేతి రాజ్ఞా
4 5 4 3 5 6 3 2 6 6
సమోష ధయః। యస్మై కృణోతి। పారయామసీతి పారయామసి
2 1 7 8 12 12
కృణోతి బ్రాహ్మణః పారయామసి రాజన్ బ్రాహ్మణ స్తం రాజం
8 9 12 11 9 10 11
స్తం తం రాజన్ తం బ్రాహ్మణః రాజన్ పారయామసి బ్రాహ్మణః
10 10 11 10 9 11 12 9
కృణోతి పారయామసీతి పారయామసి కృణోతి యస్మై
8 12 11

* క్రమమాల

ఓషధయః సం 1 — 2 రాజ్ఞేతి రాజ్ఞా
సం వదంతే 3 — 4 రాజ్ఞా సహ
వదంతే సోమేన 5 — 6 సహ సోమే
సహ రాజ్ఞా 7 — 8 సోమే న వదంతే
సహ రాజ్ఞా 9 — 10 వదంతే సోమేన
రాజ్ఞేతి రాజ్ఞా 11 — 12 సమోషధయః

యస్మై కృణోతి 13 — 14 పారయామసీతి పారయామసి
కృణోతి బ్రాహ్మణః 15 — 16 పారయామసి రాజన్
బ్రాహ్మణ స్తం 17 — 8 రాజం స్తం
తం రాజన్ 9 — 20 తం బ్రాహ్మణః
రాజన్ పారయామసి 2 — 22 బ్రాహ్మణః కృణోతి

పారయామసీతి పారయామసి 23 24 కృణోతి యస్మై
• ఇక్కడ క్రమమాలలోని పదక్రమము అంకెలచే చూపబడెను.

## (క్రమమాల)

| (ఆదితోఽంతతః)=(అంతంచాదింన యేత్) | (ఆదితోఽంతతః)=(అంతంచాదింన యేత్) |
|---|---|
| 1) 1 ఓషధయః సం-రాజ్ఞేతి రాజ్ఞా 6 | 2) 7 యస్మై కృణోతి-పారయామసితి పారయామసి 12 |
| 2 సం వదంతే-రాజ్ఞా సహ 5 | 8 కృణోతి బ్రాహ్మణః-పారయామసి రాజన్ 11 |
| 3 వదంతే సోమేన-సహసోమేన 4 | 9 బ్రాహ్మణ స్తం-రాజం స్తం 10 |
| 4 సోమేన సహ-సోమేన వదంతే 3 | 10 తంరాజన్-తం బ్రాహ్మణః 9 |
| 5 సహ రాజ్ఞా-వదంతే సం 2 | 11 రాజన్ పారయామసి-బ్రాహ్మణః కృణోతి 9 |
| 6 రాజ్ఞేతి రాజ్ఞా-సమోషదయః 1 | 12 పారయామసీతి పారయామసి-కృణోతి యస్మై 7 |

## పుష్పమాల

మాలామాలేవ పుష్పాణాం పదానాం గ్రంథిర్పి హి ప్రా
ఆ వర్తంతే త్రయ స్తస్యాం, క్రమ వ్యుత్క్రమ సంక్రమాః

పువ్వులమాలవలె పుష్పమాల యుండును. అది పదములను గ్రుచ్చును. దానియందు క్రమము వ్యుత్క్రమము సంక్రమము ఈ మూడు తిరుగుచుండును. జటవలె పుష్పమాల యుండును. । అక్కడ ప్రతిపదమున విరామము. ఇతి అనివేయుట విశేషము. కొందరును పుష్పమాలయందు "ఇతి" అన్నది పదసంధి స్థానములో వేయుదురు. ఎట్లన- "సమోషదయ" ఇతి "సమ్ ఓషధయః" బ్రాహ్మణ స్తం ఇతి "బ్రాహ్మణః తమ్" "రాజం స్తం" ఇతి రాజన్ తమ్. మొదలగునవి.

| (క్రమము) విరామము | (వ్యుత్క్రమము) విరామము | (సంక్రమము) |
|---|---|---|
| 1 ఓషధయః సం | సమోషధయః | ఓషధయః సం ఇతి విరామము |
| 2 సం వదంతే | వదంతే సం | సం వదంతే " " |
| 3 వదంతే సోమేన | సోమేన వదంతే | వదంతే సోమేన " " |
| 4 సోమేన సహ | సహ సోమేన | సోమేన సహ " " |
| 5 సహ రాజ్ఞా | రాజ్ఞా సహ | సహ రాజ్ఞా " " |
| 6 రాజ్ఞేతి రాజ్ఞా | | |
| 7 యస్మై కృణోతి | కృణోతి యస్మై | యస్మై కృణోతి " " |
| 8 కృణోతి బ్రాహ్మణః | బ్రాహ్మణః కృణోతి | కృణోతి బ్రాహ్మణః " " |
| 9 బ్రాహ్మణ స్తం | తం బ్రాహ్మణః | బ్రాహ్మణ స్తం " " |
| 10 తం రాజన్ | రాజం స్తం | తం రాజన్ " " |
| 11 రాజన్ పారయామసి | పారయామసి రాజన్ | రాజన్ పారయామసి " " |
| 12 పారయామసీతి పారయామసి. | | |

### 3 శిఖ

వదో త్తరాం జటామేవ శిఖామార్యాః ప్రచక్షతే
పదములుపైని ఉన్న జటనే శిఖగా ఆర్యులందురు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ఓషధయః | సం | సమోష | ధయః | ఓషధయః | సం | వదంతే | సం |
| 1 | 2 | 2 | 1 | 1 | 2 | 3 | 2 |
| వదంతే | వదంతే | సం | సం | వదంతే | సోమేన | వదంతే | సోమేన |
| 3 | 3 | 2 | 2 | 3 | 4 | 3 | 4 |
| సోమేన | వదంతే | వదంతే | సోమేన | సహ | సోమేన | సహ | సహ | సోమేన |
| 4 | 3 | 3 | 4 | 5 | 4 | 5 | 5 | 4 |
| సోమేన | సహ | రాజ్ఞా | సహ | రాజ్ఞా | రాజ్ఞా | సహ | సహ | రాజ్ఞా |
| 4 | 4 | 5 | | 6 | 6 | 5 | 5 | 6 |
| రాజ్ఞేతి | రాజ్ఞా। | | | | | | |
| 6 | 6 | | | | | | |

యస్మై కృణోతి కృణోతి యస్మై యస్మై కృణోతి బ్రాహ్మణః
7 8 8 7 7 8 9

కృణోతి బ్రాహ్మణః బ్రాహ్మణః కృణోతి కృణోతి బ్రాహ్మణస్ తం
8 9 9 8 8 9 10

బ్రాహ్మణ స్తం తం బ్రాహ్మణో బ్రాహ్మణ స్తం రాజన్ తం
9 10 10 9 9 10 11 0

రాజన్ రాజం స్తం తం రాజన్ పారయామసి రాజన్ పారయామసి
11 11 10 10 11 12 11 12

పారయామసి రాజన్ రాజన్ పారయామసి పారయామసీతి పారయామసి।
12 11 11 12 12 12

## 4 రేఖ

క్రమాద్ ద్విత్రి చతుష్పంచ పదక్రమ ముదాహరేత్
పృథక్ పృథక్ విపర్యస్య లేఖామాహుః పునః క్రమాత్

క్రమముగా రెండుమూడు నాలుగేసి పదక్రమమును ఉదాహరింపవలెను. వేరువేరుగా విపర్యయమునకు మరల క్రమముగా ఉదాహరింపవలయును. దానిని రేఖ అందురు.

### పూర్వార్థమునకు

2 (రెండు పదాలు) = ఓషధయః సం। సమోషధయః। ఓషధయః సం॥
3 (మూడు పదాలు) సం వదంతే సోమేన। సోమేన వదంతే సం। సం వదంతే॥
4 (నాల్గు పదాలు) వదంతే సోమేన సహ రాజ్ఞా। రాజ్ఞా సహ సోమేన వదంతే।
వదంతే సోమేన సోమేన సహ। సహ రాజ్ఞా। రాజ్ఞేన రాజ్ఞా।

### ఉత్తరార్థమునకు

2=యస్మై కృణోతి। కృణోతి యస్మై। యస్మై కృణోతి॥
3=కృణోతి బ్రాహ్మణ స్తం। తం బ్రాహ్మణః కృణోతి। కృణోతి బ్రాహ్మణః॥

4=బ్రాహ్మణ స్తం రాజన్ పారయామసి। పారయామసి రాజం స్తం బ్రాహ్మణః బ్రాహ్మణ స్తం॥ తం రాజన్। రాజన్ పారయామసి। పారయామసీతి పారయామసి

మంత్రమునకంతటికిఁ గాని.

2 (రెండు పదాలు)= ఓషధయః సం। సమోషధయః। ఓషధయః సమ్॥

3 (మూడు పదాలు)= సం వదంతే సోమేన। సోమేన సం వదంతే। సం వదంతే॥

4 (నాల్గు పదాలు)= వదంతే సోమేన సహ రాజ్ఞా। రాజ్ఞా సహ సోమేన వదంతే। వదంతే సోమేన॥

5 (అయిదు పదాలు)= సోమేన సహ రాజ్ఞా యస్మై కృణోతి। కృణోతి యస్మై రాజ్ఞా సహ సోమేన। సహ రాజ్ఞా॥

6 (ఆరు పదాలు)= సహ రాజ్ఞా యస్మై కృణోతి బ్రాహ్మణ స్తం తం బ్రాహ్మణః కృణోతి యస్మై రాజ్ఞా సహ। సహ రాజ్ఞా॥

7 (ఏడు పదాలు)= రాజ్ఞా యస్మై కృణోతి బ్రాహ్మణ స్తం రాజన్ పారయామసి॥ పారయామసి రాజం స్తం బ్రాహ్మణః కృణోతి యస్మై రాజ్ఞా। రాజ్ఞా యస్మై॥ యస్మై కృణోతి। కృణోతి బ్రాహ్మణః। బ్రాహ్మణ స్తం। తం రాజన్ రాజన్ పారయామసి। పారయామసీతి పారయామసి।

## 5 ధ్వజము

బ్రూయాదాదేః క్రమం సమ్య గంతాదుత్తారయేద్యది
వర్గేచ బుద్ధ్యాయత్ర పఠనం స ధ్వజః స్మృతః

వర్గమందుఁగాని బుక్కునందుఁగాని మొదటినుండి క్రమముగా చక్కగా చివరవరకు ఎక్కడ ఉత్తరించబడునో అది ధ్వజమనబడెను.

| (మొదటినుండి క్రమము) | (చివరివరకు ఉత్తరించుట) |
|---|---|
| 1 ఓషధయః సం | 2 పారయామసీతి పారయామసి |
| 3 సం వదంతే | 4 రాజన్ పారయామసి |
| 5 వదంతే సోమేన | 6 తం రాజన్ |

